Sri

# Sugriva : : :

# Pattabhishekam :



By

Ashtavadhani.

Abbaraju Hanumantha Rao

Head Master,

Board Hindu Elementary, School, Ailavaram



Printed at the Chandrika Press, Guntur.

 Price Re. 1.

శ్రీరామాయనమః.

శ్రీమత్

# సుగ్రీవపట్టాభిషేకము

ఇది

అచ్చాంధ్రధనిరోష్ఠ్యనిర్గద్యనృగచరిత్రకృతికర్తయు

ప్రస్తుతము రేపల్లెతాలూకా ఐలవరము బోర్డుమొదటిస్కూలునందలి

ప్రధానోపాధ్యాయుండునగు

అష్టావధాని

## అబ్బరాజు హనుమంతరావుచే

రచియింపఁబడి

కృతిభర్తయైన పల్లెగడ్డ పకీరయ్యాభిధానుని ద్రవ్యసాహాయ్యమున

గుంటూరు

చంద్రికాముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది.

 1912 వెల రు 1-0-0

శ్రీ

## ప్రార్థనాదికము.

### శ్రీరామస్తవము.

ఉ॥ శ్రీముని రాజమాన్యగుణ ♦ సీముని, సూర్యకులాబ్ధిపూర్ణిమా
సోముని, మౌనిహృత్కుముద ♦ సోముని, సాగరమేఖలాత్మజా
కాముని, గామినీతరుణ ♦ కాముని, రావణకుంభకర్ణహృ
ద్భీముని, రామునిం, గదన ♦ భీముని, నామదినిల్పికొల్చెదన్॥

### వినాయకస్తవము.

ఉ॥ వేలుపుమూక, లల్లతొలి ♦ వేలుపుమూకలుగూడిమున్ను న
వ్వేలుపుఁబోనముం బడయ ♦ వేమరుసంద్రముఁద్రచ్చునాఁడు, నే
వేలుపుమున్ను పూజఁగొను ♦ వేలుప! రమ్మని, పూజసల్పి, రా
వేలుపుమాకునిచ్చుసువి ♦ వేకముఁద్రచ్చుమదంతరాయముల్

### సరస్వతీస్తవము

ఉ॥ తెల్లనిపట్టుపుట్టముల ♦ తెల్లనినెమ్మొయిఁదిక్కలీనఁగాఁ
వెల్లనితమ్మిగద్దియవి ♦ ధిప్రముఖామరులెల్లఁగొల్వఁగా
మెల్లగఁ బైఁడివీణెయను ♦ మీటుచు, నీటుఁదలిర్పఁగుల్కుమా
తల్లి, కృపాబ్ధి, వర్ణమయి, ♦ తానటియించుత నాదువాక్కునన్

ఇష్టదేవతాప్రార్థనలోని

ఆంజనేయ ప్రార్థనకుఁ బాఠాంతరము.

శా॥ రాముండిచ్చిన యుంగరమ్ముఁగొని సం • ద్రమ్ముల్లంఘించి, సీ
తాముగ్ధాంగనఁ గాంచి దానినిడి, దై • త్యస్వామి మ్రోలన్మహో
ద్దాముండై చరియించి, భూతనయవా • ర్తన్ రాముతోఁ బల్కి, శ్రీ
రామున్మోద పయోధిఁ దేల్చు హనుమన్ • బ్రార్థింతు నశ్రాంతమున్.

•

# పీఠిక

బుధజనులారా! చదువరులారా!!

క॥ శ్రీక్షితిధర కాళేశ్వర ద్రాక్షారామంబులనఁగఁ • దనరారెడు నీ
త్రిక్షేత్రంబులలింగము లీక్షితినిద్రిలింగ సంజ్ఞ • నెన్నికకెక్కెన్

తే॥ తత్త్రిలింగనివాసమై • తనరుకతన
నాంధ్రదేశంబుఁదాఁద్రిలిం • గాఖ్యమయ్యెఁ
దెలుఁగగుచుఁ దద్భవముదాని • వలనఁబొడమె
వెనుకఁ గొందఱుదానినే • తెనుగునంద్రు

ఇట్లు, పుణ్యక్షేత్రంబులు, మహాశైవక్షేత్రంబులు నైన శ్రీశైల, కాళేశ్వర (కాళహస్తి) దాక్షారామము లనంబడు నీత్రిక్షేత్రంబులంగల లింగత్రయంబు, త్రిలింగ సంజ్ఞక వ్యవహరింపఁబడుననియుఁ, దత్త్రైలింగమధ్యస్థలంబు, త్రైలింగదేశంబనియు, నందువసించువార లాంధ్రులనియు, వారిచేత వాడంబడు భాష యాంధ్రభాష లేక త్రైలింగభాష(వికృతి = తెలుఁగు) యనియు, మఱియు ద్రినగంబులమధ్య వాడంబడిన భాషగానఁ దెనుఁగనియు సర్వలక్షణవేదియైన కాకునూరి యప్పకవిపుంగవుండు దన యప్పకవీయమున, వ్రాసియున్నాడు. ఇదియే మనయాంధ్రభాషాయోషామణి పుట్టుటకుంగలకారణము. ఇట్లే యేతత్క్షేత్రంబులకుఁ దక్షిణ,పశ్చిమంబులఁ గ్రాలుచుండు ద్రావిడ, కర్ణాటదేశంబులవాడఁబడు భాషలకుఁగూడ వ్యుత్పత్తిఁ జదువరులూహింపనగును. సత్యమిట్లుండ రామరాజ భూషణుఁడు దనవసుచరిత్రమం దాంధ్రకవిస్తవమొనర్చుచు

మ॥ మహిమున్వాగనుశాసనుండుసృజియిం • పం,గుండలీంద్రుండు,ద
న్మహనీయస్థితిమూలమైనిలువ,శ్రీ • నాథుండుప్రోవన్,మహా
మహులైసోముఁడుభాస్కరుండువెలయిం • పన్సొంపువాటించు,నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁద • త్ప్రాగల్భ్యమూహించెదన్

అనివ్రాయఁగా, నందలి "వాగనుశాసనుండుసృజియింపన్" అనువాక్యముఁ బ్రధానముగాఁ గొనియాంధ్రభాషనన్నయభట్టుకాలమునాఁడు పుట్టెననియు, నిదివికృతిభాషకాన స్వతంత్రభాషకాదనియు, సాంస్కృతికపదములకు వికృతులంగల్పించి నన్నయ

భట్టీభాషంగావించెననియుఁ, గొందరియభిప్రాయమైయున్నది. కాని యీదియంతమాత్ర మునమ్మఁదగినదికాదు. ఈవాదము వాదించువారికింకొక్కఁ డిట్టియాధారమేకానిపించదు. అదెద్దియన“ఆంధ్రశబ్ద చింతామణియందు” “సకలభాషా వాగనుశాసనుం”డని, నన్నయకొక బిరుదుండినట్లు గద్యమునఁగనఁబట్టుచున్నది. దానింబట్టివిచారించిన, నతఁడన్నిభాషలను త్పాదించియుండవలెను. కాననదియుసమంజసముకానేరదు. ఈవిషయమై బ్రహ్మశ్రీ రాయబహదూరు కం వీరేశలింగముపంతులుగారు తమయాంధ్రకవులచారిత్రమునఁ జాలవరకుఁ జర్చించియీనన్నయభట్టునకు నవ్యదేశీయపదభూయిష్ఠమెయేదియేనియొకనియమములేకున్న యాంధ్రభాషకుఁ బ్రప్రథమమునవ్యాకరణసూత్రాదినియమములం గల్పించి సంస్కారణమును, సౌష్ఠవమును గావించిన, కతమ్మున “వాగనుశాసన” బిరుదమువచ్చినదేకానిమతియొకఁ డేదియుఁగాదనిఖండించివ్రాసిరి. ఈమహానుభావుఁడే మొదటవాంధ్రగ్రంథరచనకు గడంగితరువాతివారికిఁదారిఁజూపినాడు. అయిననీతనికింబూర్వమాంధ్రమునందుఁగ్రంథములులేవని పెద్దలయభిప్రాయముకాదు. క్రీ. శ. 940 సంవత్సరప్రాంతమున సూర్యవంశసంభూతుఁడగు “నన్నెచోళదేవుఁడు” అనురాజశిరోభూషణుఁడైనకవిరాజశిరోభూషణుఁడొకఁడుండెననియుఁ, నాతఁడు “కుమారసంభవము” నానొప్పుకావ్యంబొనర్చినాడనియు, మ. రా. రా. మానవపల్లి రామకృష్ణయ్య. ఎం- ఏ గారొకచోటవ్రాశియున్నారు. కాన నిట్లేకొన్ని పుస్తకములానన్నయకుఁ బూర్వముండియున్నవి. కాని ప్రబలనిదర్శనములు దొరకువరకు నన్నయమహాకవియు మొదటి వాఁడుగ నెంచఁ బడఁదగినవాఁడయ్యెను. ఇంతయేల మనదురదృష్టవశముననేమో? వారికిఁదెలియమినో గోదావరినదికి నానకట్టఁగట్టించిన “కాటన్„ దొరవారు, గోదావరీమండలాంతరస్థ ఓక్కనవోలుగ్రామమున, మనయాంధ్రదేశభాషాచారిత్రమును వ్రాసినశిలాశాసనములుండఁగా, వానిందెప్పించిగోదావరి యానకట్ట కట్టుటకు నుపయోగించెను. కావుననే మనయాంధ్రదేశమునకిట్టిదురవస్థవాటిల్లినది. ఈకారణమునవాస్తవము తెలియుకనన్నయభట్టారకునే మొదటివానిగాఁ జెప్పికొనవలసివచ్చినది.

ఏకార్యమేని రాజాదరణలేనిది సాగనేరదుకాన, రాజమహేంద్రవరము రాజధాని కాగలరాజరాజనరేంద్రుఁడీనన్నయాది, కవిపుంగవులం గూర్చియాంధ్రగ్రంథరచనకుందారి నేర్పరపించినాఁడు. కాన “వాగనుశాసన” బిరుదమీయన వహింపఁదగినదనినాయభిప్రాయము. ఈరాజశిఖామణి నాటించిన విత్తనమే, మహావృక్షమై శ్రీనాథాదిమహాకవులకునిలువనీడయైనది. ఇంకప్రాచీన జనమ్ములు పురాణపఠన, శ్రవణాదులనొంద, నభిరుచికలవారగుటచేత, నన్నయభట్టారకాదులు, భారతాదిసంస్కృతగ్రంథ

ములఁ దేనెలొల్కు మాటలతోఁ దెనిఁగింపఁ బాటుపడిరి. కానిస్వకల్పనాచాతురిం జూప నెంచరైరి. ఈకొలంత "నాంధ్రకవితాపితామహ" బిరుదువహించిన చతుర్విధకవితామతల్లికా ల్లసాని పెద్దనామాత్య మణినాపినాడు; ఈమహాకవివర్యుఁడే, తాను ప్రబంధరచనం గావ్యమల్లితగు వాతికవులకుం దారిచూపినవాఁడు.

ఇంక వేదములకు వ్యాఖ్యానప్రాయములైన సర్గాదిపంచలక్షణములఁ గలిగిన గ్రంథములు పురాణములు నాబడు పారంపర్యముగా వచ్చు పూర్వచారిత్రములమూలమున జనులకు నీతిబోధించుపాత్త్రమ్ము లితిహాసములు నా నొప్పు పురాణకథాభాగములఁగొంత వరకుఁ గ్రహించి, యచ్చట స్వకపోలకల్పనాచాతురీధురీణత్వముం జూపుచు.

ఉ॥ కేవలకల్పనాకథలు • కృత్రిమరత్నము, లార్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము, ల • వారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు • సానలఁ దీర్చినజాతిరత్నముల్
గావుననిట్టిమిశ్రకథ • గా నొనరింపుము నేర్పు పెంపునన్

అనివసుచరిత్రము రామరాజభూషణుఁడు వ్రాసినట్లుగా నింపగు రీతినిరచియించినపుస్తకములే ప్రబంధములనఁబడును. ఏతద్గ్రంథమునీనియమముతో వ్రాసినవాఁడ నైతి. ఇందలికథాకల్పనాచమత్కారాదులావల సంగ్రహముగ వక్కాణించెద.

మహాకావ్యలక్షణములగు, పుర, నదీ, నగ, ఋతు, సూర్య, చంద్ర, సరోవర, వన, మధు, విరహ, వివాహ, సంభోగ, పుత్రోదయ, నీతి, యాత్రా, యుద్ధ, దూత, రాజవర్ణనములచేఁ గ్రాలునది మహాకావ్యము నాబడు ఇం దెవ్వియేని కొన్నిలోపించిన కావ్య ముపకావ్యము నా నొప్పు. ఈకావ్యమున నీవర్ణనము లచ్చటచ్చటం బొందుపరుపంబడినవి వానినెల్ల సంక్షేపముగ నిట నెత్తిచూపెదఁ గనుఁగొండు.

1 పురవర్ణనము.

మ॥ తిలకించెన్, మణివప్రచుంబితమహా • దేవేంద్రధామమ్ము, ను
జ్జ్వలఖేయస్థసుగంధినీరవిచర • వ్యాళాంగనానర్మవా
క్యలసద్వక్త్రశశాంకమండలముఁ, ది • వ్యద్వైభవాడంబరా
ఖిలవిద్వత్కవివర్ణనీయమగుకి • ష్కింధాపురీరాజమున్ 176 ప్ర॥ ఆ

2 నదీవర్ణనము.ద్వ్యర్థి.

సీ॥ గొప్పగోత్రమ్మునఁ • గులవర్ధనియటంచు
సహజాతిలెల్లమె • చ్చంగఁ బుట్టి

తండ్రీమైనస్వగోత్ర • తల్లజుముందఱ
మేలిజాడలమెల్ల • మెల్లమెట్టి
ఘనతరులసుజేర • జనని వేళులనుండి
చెదరిగుణాబ్ధులఁ • జెట్టఁబట్టి
నటదూర్మికాకంక • ణాదులఁ గొమ్మెుఱుం
గులుఁ గాలఁగాఁజాలఁ • గొనబుఁదట్టి
తే॥ కాశపుష్పాఢ్యవేణికా • గరిమఁ తోడఁ
బ్రబలతరతుంగభద్రాళి • పదవిఁ తోడ
నెమ్మినవ్యాక్షుమధురస్వ • నమ్ముతోడఁ
బొలుచుగృష్ణానదియుఁగృష్ణ • కులుకుతోడ 35 ప్ర॥ఆ

3 నగవర్ణనము. ద్వ్యర్థి

చ॥ మృగధరుఁడైనవాని, ముఖ • బృందముకోల్వగఁనొప్పువాని, ము
న్నిగఁగలవాని, జందురుని • నిందయొనర్చెడుకాంతివానిఁ, బె
న్నగనధునీతరంగముల • నానెడునొదలవాని, మేనకా
సుగుణయుతాత్మజాభిరతిఁ • జొక్కుముదంబుధిఁదేలువానినిన్ 72 ద్వి॥ఆ

4 ఋతువర్ణనము.

ఉ॥ మూఁపులపంట, పూవిలుతు • మూఁపులునోచిననోముపంట, నె
త్తావులఁజిల్కుకుంట, పలు • తావులఁజల్కెడుజాజితంట, క్రొం
బూవులవింటిదంట నెర • పూనికకుందగినట్టిజంటబల్
కేవులఁగుల్కుతేంట్లదగఁ • డించెడునామనిదంట, వచ్చె నా 46 ద్వి॥ఆ

5 సూర్యోదయవర్ణనము.

తే॥ ఓలిసతపేరిపచ్చగు • ఱ్ఱాలజత, న
మర్చినరథంబుఁదొడలేని • మల్లుఁడొకఁడు
దోడితేనెక్కిహరిదోచేఁ • దూర్పుకొండఁ
బ్రాగ్దిశాకాంతచేలిహా • స్యంతినాఁగ 205 ద్వి॥అ

6 అస్తమయవర్ణనము.

తే॥ వరుణదిక్కామినీమణి • వంటసేయ

వార్ధికూపమ్ములోఁ బిటి • నర్ధిఁదీయ
సాంధ్యరాగరజ్జువుఁగట్టి • జారవిడిన
ఘటోన్న బిందెనా వార్ధిపూ • ర్యుండు గుంకె. 169 ద్వి॥ఆ

7 చంద్రోదయవర్ణనము.

తే॥ పూర్వదిగ్భామినీవక్త్ర • పుండరీక
మోయనంగ సుధాకరుఁ • డుదయమయ్యె
నమ్మదితమృగమదతిల • కమ్మనంగ
లలితకాంతిఁ జెలంగెఁగ • ళంకరేఖ. 174 ద్వి॥ఆ

8 అస్తమయవర్ణనము.

తే॥ కలువపూబోండ్లఁగూడిసి • తొలఁగుభావ
రాఁదలఁ చెఱుమ్మటంచుఁద • ద్రమణికొరుగఁ
బలికిస్నానమ్ము శమదీరఁ • బశ్చిమాబ్ధిఁ
జల్వసేగినగతిఁ గ్రుంకెఁ • జలధవిభుఁడు 204 ద్వి॥ఆ

9 సరోవరవర్ణన,

సీ॥ వెలిదమ్మిఁ దిమ్మరు • విరిదిమ్మరులుముద్దు
మొగముపైముంగురుల్ • మురువుఁజూపఁ
దరగయుయ్యెలలనెం • తయునూగుజక్కవల్
తెఱులపైఁ జందోయి • తెఱఁగుదోపఁ
గలువపూవులఁగుల్కు • గండుదుమ్మెదదిమ్మ
సొబగుఁగన్నవచూడ్కి • సొంపుఁజూపఁ
గప్పుఁదేరెక్షునాచుఁ గప్పచేపలగుంపు
సిగపైనిమల్లెపూల్ • చెలువుఁదోప
తే॥ నలువతేజీలునడకనె • న్నడలుగాఁగఁ
బవడఁపుందీవెజగిమేని • పసలుగాఁగఁ
దొనరుకెందమ్మితూండ్లు కే • ల్దోయిగాగ
బరగుకొలఁకులచ్చినిఁగాంచి • రరుదుగాగ 108 ద్వి॥ఆ

10 వనవర్ణనము. (ఉద్యానము.)

చ॥ వలపులకాటఁపట్లు,నళి • వారముపాలిటివేల్పుఁజెట్లు,నా
వలపులరాజుప్రేట్లుపడు • వారలుత్రిమ్మరుమేలిచోట్లు, మేల్
వలపులరాజుదండ్లుకళ • లంబతియించెడుపీడుపట్లు,బ
ల్వలపులజేనిసంగరఁపుఁ•బట్లుఁపురింబువృఁదోఁట లెంతయుఁ 179 ప్ర॥ ఆ

11 అడవి.

ఉ॥ సాల,రసాలసాల,సుర • సాల,వినీలతమాల, జాలహిం
తాల,పలాశ,బాలవట , తాలవిశాలపటీర,పాట,లై
లా,లవలీ,లవంగ,నవ • లాంగల,లాంగలి,నారికేళపా
ళీ,లలితార్జు,నామ్లకద • ళీతరుశోభితమావనీస్థలిఁ 126 ప్ర॥ ఆ

12 మధువర్ణనము

ఉ॥ మూఁకలుజుట్టుఁగొల్వ,"నెల • పూవులతేనియలాని,,జుట్టుపు
ల్గీకలఁగట్టుపినసల • నొంతయుపీవభటాళి,తీయనా
దాకలపండ్లుడించుఁబువు • దండలఁదాల్చిముదబ్ధిఁదేలుచుఁ
మూఁకలజేఁడుబ్రొస్తురహిఁ•బుచ్చు సుసుండిరిశైలనందనా 94 ద్వి॥ ఆ

13 విరహావర్ణనము. ద్వి॥ ఆ॥ 191

ఉ॥ పాయనుఁబల్కకేగ వెఱ • పాయను,బాళినిఁగాంచకుండుటిం
పాయను,బల్కవింతమఱ • పాయను, నర్గరుణాబ్ధిఁదేల్చుతె
ప్పాయను,మేరమీరుటొల • పాయను,నారతనాలమేలికు
ప్పాయను,మేలుఁగూర్పమిఁక • పాయను,పాయుటనేరుపాయనుఁ

14 వైవాహికవర్ణనము.

క॥ కమలాయతాక్షిసీతాం
బమహావైభవముతో"ని • మాంకన్యాంతు
భ్యమహంసంప్రదదే"యని
క్రమతెందాధారఁబోసె • రాముఁనకెలమిఁ 69 చ॥ ఆ

15 సంభోగవర్ణనము.

ఉ॥ చందురుకాలమేడలఁబ • సందగుకుందవనంపువాడలం
గందఁపుఁజెట్లనీడలఁ,జ • గాజిగతమ్మికొలంకుజాడలం
"గందుదురంపుఁదోటలఁ,,జొ • కాటఁపుఁబాటల,వింతమాటలం
జందనగంధతారకపి • చంద్రుఁడువాలిసెలంగిరెంతయోఁ 29 ద్వి॥ఆ

16 పుత్రోదయవర్ణనము.

శా॥ ఈలీలంగ్రహపంచకమ్ముఁరవితో.• నేకమ్ముగానట్టిదా
మేతౌలగ్నమునందుఁగాంచెఁగలహం • సీయాన,రామామనో
జ్ఞాలంకారు,రమాకుమారసుమనో • జ్ఞాకారదూరుం,గవీం
ద్రాలంకారుఁగుమారుఁదివ్యచయసం • వ్యాప్తిప్రభావారుసిఁ

17 నీతివర్ణనము. (ద్వి॥ఆ॥36)

క॥ రాదుజర లేదుమృతియని
పాదుకొలిపినెమ్మనమునఁ • బడిఁబడిరెంటిఁ
మోదమునఁగొనుము ననుగొని
పోఁదొడఁగెనుమృత్యువంచుఁ • బుద్ధ్యముకంఠుఁ 78 తృ॥ఆ

18 ఆఖేటఁ(యాత్రా)వర్ణనము.

శా॥ పైనంబైనఁబ్రథానులర్కజుపుకో • భాగంబునం,దశ్వరా
డ్యానారోహణమాచరించితమిడా • యంఁబోయలున్మాపులఁ
రైనంభేర్పడబోనులున్వలలుతే • వందార్చిరాఁ,బెండ్లికిం
బైనంబై చనులాగువారొయవనికిఁ•వాద్యార్భటుల్ జెల్గఁగాఁ 66ద్వి॥ఆ

19 యుద్ధవర్ణనము.

శా॥ వేలీలఁజనివృకుమూలమునకే • విఁమీరగాఁబొంచిప్ర
త్యాలీఘుండయిక్రూరనారిసమొకం•డమ్ముల్పొదందూసిఢా

కై లీలందగువింటగూర్చిగుణమూ • కర్ణాంతముగ్ లాగిపృ
థ్వీలక్ష్యంబరిబోరనిల్పిచదిపే • ధీశాలివారిగ్ లలిగ్ పం॥ఆ

20 ద్యూతవర్ణనము.

సీ॥ ఇట్లుపాడుచుఁగొంద • తేణీదృశలతోడ
బంగారుపలకపైఁ • బరచిసారె
"లెత్తినచో నెవ్వ • రేవష్టమైనను
బంటకాయేనిచం • పంగవలయు
సూ!నాయమూరయు • చోమధ్యవర్తులే
మాటాడవలెనుప్లు • మాటలాడఁ
దగ"దనిచాటించి • తరుణి! పందెమువేయు
మనిపురికొల్పిత • ప్పాడఁగినిసి
తే॥ సారెకెత్తఁగించుచుంతంత • సారసాక్షి
నాగుమనితానుసారెల • నలవరించి
మొరులుగెలిచినచోఁ(దుఖ్ఖ • కుంపుడంచుఁ
బందెమునువేసెఁదారుని • పట్టిపట్టి 127 ద్వి॥ఆ

21 రాజవర్ణనము.

సీ॥ (శ్రీ)కరరుచిమనో • జ్ఞాకారమురవారిఁ
గర్ణాంతదీర్ఘాంబ • కములవారిఁ
జటులపోలికఁజుట్టు • జడలచుట్టలవారిఁ
గమనీయమైనవి • (క్రమముపారి
వీఁకమైమోఁకాలుఁ • దాఁకుచేతులవారిఁ
బలువింప్లమూపులఁ • బరగువారిఁ
బాలుపారురాచకి • వులఁజెలంగెడువారిఁ
గావిధట్టులఁబిట్టు • (క్రాలువారి

తే॥ డంబు మెఱుఁగుటుక్కువిప్పాటుఁ గరంబువారిఁ
గంబుసుందరమంగళ • గళమువారి
నవ్యగణనీయశుభలక్ష • ణములవారి
రామలక్ష్మణులం గాంచె • రవిజుఁడపుడు 85 చ॥ఆ

ఇట్టివర్ణనాదులం గలుగులాగున బొత్తముగ వ్రాయించి, యాంధ్రభాషాయోషను శికింబోషణకర్తలైనవారిలో నొకఁడనిపించుకొని కీర్తిమించిన యతండు నీ శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకకృతికర్తయు, నెల్లగడ్డకులపయఃపారావారచంద్రుండు నగు

పకీరయ్యాభిధానుఁడు

కృష్ణావేణీమధ్యస్థలాంతరస్థ కిష్కింధాపురీవరావాసుఁడు, కమ్మకులాభరణుఁడు కృతానేకసప్తసంతానుఁడు, నైనవాఁడు. ఈయనయే

నాచేత

శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము వ్రాయించినవాఁడయ్యెను. ఇక్కడ మచ్చారిత్ర మొక్కింత ముచ్చటించిన వెనుక ప్రస్తుత కార్యాంశమునకు వత్తము. మదీయపితృపితామహాదుల జన్మస్థానము నర్సారావుపేట తాలూకా చిలకలూరుపేట వేలూరు. మజ్జనన స్థానము వినుకొండ తాలూకా వీపూరు పూర్వనివాసస్థానము మాతామహస్థానంబైన వినుకొండ తాలూకా చిత్రాపురాగ్రహారము శివారు క్రొత్తపాలెము ఇప్పటినివాసము తెనాలి తాలూకా దోనెపూడి. నేనిచ్చట హిందూస్కూలునఁ బ్రథమోపాధ్యాయుఁడుగా నున్నవాఁడ, ఆంధ్రపంపితుఁడు మాఘమాహాత్మ్యాది కృతికర్తయు మజ్జనకుండు నైన శేషాచలామాత్యునివద్ద ననవరతవిద్యాభ్యాసమొనర్చి కవిత్వ మలవడఁజేసికొని ముటికొండటి పెద్దల సత్సహవాసమున, నవధానముఁ గొంతవరకు జేయనేర్చి కొన్నియెడలఁ జేసి తత్పూర్వాపరంబులఁ గ్రంథరచనకుం గడంగి, వాణీశతక, హరిహరనాథశతక, నిరోష్ఠ్య పితృశతకాదులొనర్చితి. ఆపైన "అచ్చాంధ్రనిరోష్ఠ్య నిగద్యసృగచరిత్ర" కవికర్ణపేయాంబరీష చారిత్రాదులు పద్యకావ్యంబులుగ వ్రాసితి. ఆవెనుక మార్కండేయ స్తవ, శంకరకృత లక్ష్మీనృసింహస్తవాదులు తెనిగించినాఁడ. శైలిం దెలియులాగున వానియందలి కొన్ని పద్దెంబులెత్తి చూపెద.

క॥ శ్రీమద్విరించివిష్ణ్వీ; శామరతతిచేతఁబూజ • లందెడునీవా
తామరలఁబోలుపదములు; నామానసవీధినిలుపు॥ నయముగ వాణీ!

[వాణీశతకము]

క॥ సూరివరేణ్యుని ద్రోణునిఁ, గారవమున సేనకధిపుఁ • గాఁజేసెనుగాం
ధారీతనయాగ్రేసరుఁ; డారూఢిగ భీష్ము వెనుక • హరిహరనాథా!

[హరిహరనాథశతకము] 67

ఉ॥ ఊరనుగుఱ్ఱలంగలసి • యొక్కటనాడెడుచోటనాటలన్
నీరనుజిడ్డులాగనసి • నిల్చి చరించఁగఁజెల్లునీకు, నా
తీరుననుండకున్న నినుఁ • దిట్టుదు, రందఱుఁగొట్టఁజూతురం
చారసిసారెసారెరహి • నాడెడుతండ్రికిఁజాలరేరునన్

[నిరోష్ఠ్యపితృశతకము] 6

ఉ॥ జక్కఱనాతిచెంతఁగని • చాయలఁగ్రాలెడిగోతిచెంతఁదా
రక్కటికానఁగాంచ,నడ • యాడెడిగాదిలిచోఱలాఁగలోఁ
జక్కఁగనక్కనిక్కఁగల • జక్కిని నెక్కుడుదంట నాకొలల్
చక్కఁగలాని,నాకయిత • చక్కఁగఁజేయఁగలాని నెన్నదన్

[అచ్చాంధ్రనిరోష్ఠ్యనిర్గద్యనృగచరిత్ర ప్ర [ 9 ప]

సుగంధి॥ టక్కుకొండొనర్చిగిడ్డిఁ • డక్కఁజేసికోగనో
తెక్కలీడ! కాంచెదిట్టి • తెక్కలీంద్రనంగనే
తెక్కసేయనింతయేని • లేచితల్లరోరినీ
నక్కజిత్తెఱింగితింక • నన్నెఱింగితేఁచుసీ!॥ తృ. 15

తోటకము॥ కనకాంగిరో! మోమున • గస్తురిబొ;
ట్టునుజారదు, చీరము • డుంగదు, చం

దనముంజనులంజెడ • దాయెకనక్
గానితోధవ్రుడజ్ఞుడా • కోయనవే [కవికర్ణపేయము]6

శా॥ కంటేమింటికి, మంటికొక్కటిగము • క్కంటే! దయంగెటి,వె
న్నంటే వచ్చెడి, దమ్మికంటిసుడివా • లాదచ్చికంటిందమిం
గంటే,నాపనికాదటంటెనిఁకమీా • కంటేరిపుంగెంటఁజాల్
దంటే లేడని వచ్చితిన్మోనలవాల్ • దంట్గారహింగావవే

ఆంరీభపచరిత్ర.

అటమీాద నీసుగ్రీవపట్టాభిషేకము నైదాశ్వాసముల పద్యకావ్యముగా, సుమా రు వేయిపద్దెములకుఁ బైగ నుండునట్లు కృతికర్త ప్రోత్సాహమువలనను బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారాయకవి శిరోభూషణ సాహాయ్యమువలనను దత్కృత శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణమునను శ్రీమదుత్తర రామాయణమునను, గొంత కథం గ్రహించి నాశక్తికొలఁది కొన్నికల్పనలంజేర్చి నాకీశ్వరుఁడిచ్చిన బుద్ధిచొప్పున వ్రాసినాడ. మఱియు, గొన్నిపనితొందరవలన నేనీకావ్యము నైదుమాసములలో వ్రాసి ముగింపవలసినవాడనైతి అట్లగుట నా తెలివితేటల మాట దేవుఁడెఱుగును గాని, తప్పులు తప్పులుగనుండునని నే నొప్పుకొనెద. ఇట్లత్యల్పకాలములో నేల వ్రాసి ముగించితివన్నచో నెక్కువకాలములో నెక్కు శ్రమతీసికొని వ్రాయుదమన్ననో కాలహరణమే తప్ప నా తెలివితేట లింతకంటె హెచ్చుకానేరవు.

ఈపాటినాఁడవేల కవిత్వముల్లెడవంటి రేని.

చ॥ పలువురు సత్కవిత్వమది • పాల్పడకుండియుఁగొన్నిపుస్తకం
బులు రచియించి సిగ్గిలక • మోదముఁజెందుట తప్పుగాదు పు
త్రులు దనకుద్భవించినఁ గు • రూపులుగాఁగలరంచు భార్యతో
గలయక మాను నే సుతులఁ • గాంచకయుండు నె రూపహీనుఁడున్॥

అని బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరులు పల్కినట్లు మహాకవులపాత్తములపైఁగూడవిమర్శనము వేఁపచుచూడ "మహాగజాః పలాయంతే మశకానాంతు కాక థా" యనునట్లు నిక నావంటివాని నెన్న నేల.

ఉ॥ ఎవ్వని కెంతబుద్ధి పర • మేశుఁడు దాఁ గృపచేసె నట్టి దై
నివ్వటిలుం గవిత్వరుచి • నేరుపు చాలినఁ జాలకుండినన్
నవ్వక వర్తమానకవి • నాథులు చేకొన రయ్య మత్కృతిం
బువ్వులు గందకుండ రస • ముం గొను తేటులవంటి నేర్పునన్॥

అని కనుపర్తి యబ్బయామాత్యమణి నుడివినట్లు దలంచి సాకైతఁ గైకొందురనియు.

క॥ అల్లితిమి త్రోచుగతికవి తల్లజులొనరించు గ్రంథ • తతికిది సమమా
ఝల్లికి ఝల్లే పల్లెకుఁ బల్లే యని పెద్దలాడు • పల్కులు వినమా॥

అని బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వరులన్నట్లు తాము వ్రాసినపాత్రమ్ముల కిది యెత్తురాదనియు నే నెఱుగుదు. రెండియు నానిశ్చయోద్దేశ్యము నిందవతారికలోఁ బ్రాజ్ఞులకొనరించిన విజ్ఞాపనమువలన నెఱుగనగును. మున్నీకథనే కంసాలి రుద్రయ మహాకవి దృశ్యకావ్యముగ వ్రాసినవాఁడట. కాని యిట్లు పద్యకావ్యములు వ్రాయువారిలో నేనే మొదటివాఁడనని తలంచెద. ఈ గ్రంథము సుగ్రీవపట్టాభిషేకకథఁ బ్రాధాన్యముగఁ జేసికొని వ్రాయఁబడినందున శుభస్కారమ్ముగ శ్రీమచ్ఛబ్దంబుతోఁ జేర్చి శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకమని దీనికి నామంబిడినాఁడ. ఇందు ద్వితీయాశ్వాసమంతయుఁ దృతీయాశ్వాసమునఁ గొంతవరకు నాచేఁ గల్పింపబడినది. పూర్వకవులు వోయిన త్రోవల నేపోయి కొన్ని విధములయిన శబ్దార్థాలంకారాదులు, జాతీయములు, లోకోక్తులు, నందందు శక్తికొలఁదిఁ బొందుపరచితి. కాని వానినెల్లఁ గ్రంథవిస్తరభీతి నెత్తి చూపమికిం గనలక పుస్తకమున నాయాయిచోట్లఁ గననొప్పు. ఇఁక నిందు రెఫశకట రేఫమైత్రికి దథమైత్రికిఁ లడమైత్రికి నణమైత్రికి, నఖండవిశ్రమాదులకు నొప్పికొని వ్రాసినాఁడ. కాన వానిం గాంచి పండితులు నిందింపకుందురు గాత. పీఠికలోఁ గాని పుస్తకములోఁ గాని నాలో పళతమ్ముల బోనాడి తప్పులవీడి యొప్పులగ్రహించి నాకుఁ బ్రోత్సాహముగల్గఁ జేయఁ బండితుల వేనోళ్లఁ గొండాడెద. మఱియు నిది రామకథామిళితమైన గ్రంథము గాన నెల్లవారికిఁ జతుర్విధఫలదాయియగు గాత.

ఇక్కాలమున నెల్ల విద్యలంగలవ, నవకాశతయెల్ల వారికిం జిక్కియుండెఁ గాన నెల్లవారు మృదుమధుర గోష్ఠనీపాకంబునఁ బొత్తంబుల రచియించి మనయాంధ్రభాషా యోషామణిం బోషింతురుగాత.

పరమేశ్వరుఁ డెల్లగ కిట్టిబుద్ధిని దనయెడ భక్తిని దయచేయుగాత.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,

ద్రోనపాకి } అ. అ. హ.

కృతికర్త.

## శ్రీమత్సుగ్రీవపట్టాభిషేక గ్రంథముపై సంస్కృతాంధ్రపండితులొసంగిన యభిప్రాయములు.

### 1

రాజమహేంద్రవరము దొరతనమువారి కాలేజిలోఁ బ్రథానపండితులును, మహామహోపాధ్యాయ బిరుదాంచితులును, బిల్హణీయాదికృతి కర్తలును, నయిన మ. రా. రా. బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నశర్మ గారిట్లు వ్రాయుచున్నారు.

రత్నావళి. అబ్బరాజు హనుమంతరావనెడు నార్యవర్యుఁడు రచించె నసం
బబ్బసుగ్రీవపట్టాభిషేక మనుకృత్యుత్సవమద్దానిన్
నిబ్బరముగఁ బఠింపఁ "హనుమ", దీనిఁ జేసెననిసంతసమొంతే
నబ్బఁగొ వెంకటరత్నశర్మర త్నావళిదీనినొసంగెదగన్

ఇట్లు

రాజమహేంద్రవరము
3—1—13

కొక్కొండ వేంకటరత్నశర్మ,
మహామహోపాధ్యాయుఁడు.

### 2

మదరాసు ప్రసిడెన్సి కాలేజిలోఁ బ్రథానాంధ్రోపాధ్యాయులును నాంధ్రవాల్మీకిరామాయణాది కృతికర్తలును, నయిన మ. రా. రా. బ్రహ్మశ్రీ శ్రీమదాంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుపంతులవారిట్లు వ్రాయుచున్నారు.

కం॥ తప్పులు మెండనిమీరే; చెప్పితిరదిగొప్పగుణము చెలఁగునుగుణముల్
మెప్పింతు రైలిమనోజ్ఞము; యొప్పును రసభావగుణస మున్నతికృతిలోన్

ఇట్లు

తిరువళిక్కేణి
24—12—12

వావిలికొలను. సుబ్బరావు
ప్రసిడెన్సికాలేజి ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు

3

పిఠాపురముమహారాజా స్థానకవులును, శతావధానులు, నైన మ. రా. రా. బ్రహ్మశ్రీ రామకృష్ణకవులు వారి యభిప్రాయమిట్లు సెల విచ్చుచున్నారు.

వ. అయ్యా! మీసుగ్రీవ పట్టాభిషేకముఁ గంటిమి. కథాసరఃశిరమణీ యముగ నున్నది.

కవితకార్యస్థానము చిత్తగించవలెను.

పిఠాపురము
ది 27—12—12

రామకృష్ణకవులు,
ఆస్థాన విద్వాంసులు.

4

వినుకొండతాలూకా చిఠాపుర్యాగహారము, శి. క్రొత్తపాలె మూవాసముగాఁగల్గి సంస్కృతాంధ్ర పండితులును, సంధ్యానందనతా త్పర్యదర్పణాది గ్రంథకర్తలును, మూమేనమామలునైన మ. రా. రా. బ్రహ్మశ్రీ భార్గవరపు శ్రీరామశర్మశాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

కం॥ శ్రీరస్తు ... ... ... ... ... ... ... ... శుభలేఖతదాపది.

తే॥ అబ్బరాజాన్వవాయను • ధార్థిపూర్ణు!
మాఱ్ఱహనుమద్వచోమృతి • హరిబిందు
భోజతొండిల మహ్మనః • పుష్పలిహము;
సారిపట్టాభిషేకాప్తి • సంతసించె  1

తే॥ పుర,నది,నగ, ఋతు,సూర • పుష్పవన,వి;
రహ,వివాహ,సుతోదయ, రాజ,భోగ,
రణ, మధు,ద్యూత,సంభోగ, • రాజనీతి;
వారవర్ణన లేమందు • వహవ,వహవ.  2

కం॥ సుగ్రీవజయముఁ బొగడు"బు;
ధగ్రామణి,, దాసవరద • దాశరథికృపా
పాత్రగ్రహరత ధన్యుఁడగుం;
బాత్రగ్రఘుపతికతఁడు మిత్ర • భక్తుండగుటన్ 3

ఇదిదివ్యం బిదిభవ్యం; బిదెయిహపరభుక్తిముక్తి • పృథులయశశ్శ్రీ
ప్రదము. కవిగేయసత్కథ కదసుగ్రీవాభిషేక • కథనంబగుటన్. 4

కం॥ నోరుఁగల కవులుసత్కథ
సారవచోమృతములొల్క • సారెకుఁబల్కం
గా రమతత్పతి యుతయయి
వారింటం జేరియుండ • వలెనని చేతకున్.. 5

వినుకొండతాలూకా
చిరాపురాగ్రహా
రముశివారుకొత్తపాలెము.

ఇతి. యుష్మన్నాతులః
...వసం. శ్రీరామశర్మ.

5

నర్సారావుపేట తాలూకా కొప్పరగ్రామవాస్తవ్యులును, కుండినకవిసింహాది బిరుదాంచితులును, శతావధానులునయిన మ. రా. రా. బ్రహ్మశ్రీ కొప్పరపు వేంకటసుబ్బరాయ వేంకటరమణకవి పుంగవులిట్లు వ్రాయుచున్నారు.

వ. అయ్యా! తమరు మాయభిప్రాయమును గోరి పంపిన "సుగ్రీవపట్టాభిషేకమును" జూచితిమి.

గీ॥ అనఁగనిరువదిరెండవ • ర్ణనలుగూర్చి
చెప్పవలయుఁబ్రబంధమ్ము • శ్రీనివాస!?

అని యప్పకవి చెప్పినట్లు తగువర్ణనలుగల్గి మీప్రబంధంబున్న యది. మీకృతిభర్తయయిన శ్రీమత్పకీరయాభిధానుండు బుణ్యపురుషుండనుటకు సందియము లేదు. మీకవిత్వముమృదువుగా మధురముగానుండుననుటకు సందియము లేదు. తమకు నిర్దుష్టములయి మనోహరములయినమహాప్రబంధంబులు రచించుటకిట్లే భగవంతునియనుగ్రహము తోడ్పడుగాత. చిత్తగింపవలెను.

ఇట్లు

3—1—13
కొప్పరము
సంతమాగులూరుపోష్టు



కొప్పరపు సోదరకవులు
శతావధానులు.

6

ఆకేపల్లిముప్పాళ్ల కాపురస్థులును, ననేకాష్టావధానవిరచనాచాతురీధురీణులును, నైన మ. రా. రా. బ్రహ్మశ్రీ గోపాలునిహనుమంతరాయశర్మశాస్త్రిగారు, నేరుప్చరి లక్ష్మీనృసింహశర్మశాస్త్రిగారు, నిట్లు వ్రాయుచున్నారు.

తే॥ శ్రీమదఖిలనృపాల సం • సేవితపద;
కమలభవులును వైదుషీ • గౌరవులును,
సంస్కృతపఠత్వకవితావి • శారదులును;
నైన శ్రీహనుమంతరా • యార్యులకును

క॥ హనుమన్నృసింహ కవులము;
ఘనభవదాశీః ప్రభావ • కలితోత్కృష్టా
భ్యనుపమ కవితాయుతులము;
కొనవే మావందనములు • కోవిదవర్యా!

మ॥ సుమనఃకాండవిశంకట ప్రణుత! త్వ • త్సుగ్రీవపట్టాభిషే
కముఁ గన్గొంటిమి, నేఁడు, కానివిలస • ద్గంభీరవిస్రంభణా
చ్ఛమహాగాథ నిరర్గళాశుకవితా • సామ్రాజ్యతంత్రాలుమీ
దుమనోదార్ఢ్యతకిద్దిచాలదని మీ • తోఁ జెప్పఁగా నున్నవా
రము "హన్మంతసుధీమణీ! ప్రకటసా • రాచారధీరాగ్రణీ!

మ॥ కవిలోకోత్కరగేయమై యకరమై • కమ్రప్రభావాభి మం
జువిలాసాచ్ఛపదప్రపూరితమునై • శుంభత్ప్రసాదైక సా
ధ్విశేషాకరమై, దురంతకఠినా • శ్లేషరాహిత్యమై
భువి "మీగ్రంథము" వెల్గుచుండెఁగరుణాం • భోధీ! విరాజత్సుధీ!

గీ॥ వ్రాయఁదలచిన మీప్రథా • వంబుచాలఁ,
గలదయిదుపద్యములుమాత్ర • ములిఖియింపుఁ,
డంచువ్రాయించు మీకమ్మ ననుసరించి;
యేమువిరమించినారము • హితవనుగుణ. 5

ఇట్లు విన్నవించు విద్వద్విధేయులు

| 18-12-12 ముప్పాళ్ల | గోపాలుని హనుమంతరాయశర్మశాస్త్రి, పోతరాజు లక్ష్మీనృసింహశర్మశాస్త్రి | అష్టావధానులు. |
|---|---|---|

7

నెల్లూరుజిల్లా కావలి వాస్తవ్యులును, ప్రస్తుతము గుంటూరుజిల్లా రేపల్లెతాలూకా పెదపులివర్రు గ్రామములోని సంస్కృతపాఠశాలోపాధ్యాయులును, శతావధానులును, నైన బ్రహ్మశ్రీ వేమూరి నృసింహశాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

శ్లో॥ పూర్వంహనూమాన్ రఘురాడనుగ్రహా
త్సుగ్రీవనామ్నః కపికుంజరస్యచ।
పట్టాభిషేకంకృతవాన్ ససాంప్రతం
తంవర్ణయామాసపద్యైర్మనోహరైః.

శ్లో॥ అబ్బరాజకులవారిధిచంద్రః। శ్రీహనూమదభిదః కవివర్యః
యాంబబంధకృతిమత్రననోపాః। కింతుసద్గుణగణాఃపరిదృష్టాః 2

శ్లో॥ పదాసిరమ్యాశికథామనోజ్ఞా। గభీరతాత్పర్య మనోహరత్వం
మైత్రీపదానాం పరిదృశ్యతేఽత్ర। తత్రశ్రుతఃకింనఫలంవిభర్తి 3

ఇత్థం

పశ్చిమపుటివట్లు

శతావధాని
వేమూరి. నృసింహశాస్త్రి

8

శ్రీ స్తోత్రాఖ్యకనగాలవాస్తవ్యులును, శ్రీమదంబరీషచరిత్రాదికృతికర్తలును, నైన మ. రా. రా. బ్రహ్మశ్రీ నడింపల్లి వేంకటరత్నశర్మగారిట్లు వ్రాయుచున్నారు.

సీ॥ పదసౌష్టవములకా, స్పదమర్థసౌలభ్య,
ములకిమ్మురసములు,గలుగు నెలవు
పాకభేదములకు, భవనమలంక్రియా
జననమ్మునకు నివాసస్థలమ్ము
శయ్యలకిరవు వి, శ్రాంతివ్యంగ్యమ్ముల
కాలవాలము గుణ, జాలమునకు
భావోదయములకుం, బాదువృత్తులకిక్క-
కీర్తులకాధార, భూతమిద్ధ

న బ్రహ్మశ్రీ అబ్బరాజు సీతారామయ్య గారిట్లు వ్రాయుచున్నారు.
ప్రియసోదరా!

ఉ॥ శ్రీరమణీయపుంగవితఁ • జెప్పఁగఁజాలితి నీకవిత్వపుం
ధోరణిఁ గాంచువారలమ • దుల్ గుతుకంబునుజెందునట్టునా
నేరుపుఁగల్మి నెమ్మది జ • నించినమోదమెసంగఁబద్యముల్
గూరిచినాఁడ మిక్కుటఁపుఁ• గూరిమితోడను గొమ్ము వే సమ
స్కారములెల్లవేళలను • జల్పెద శ్రీహనుమత్కవీశ్వరా! 1

మ॥ సుమతుల్ జిత్తమునందుమెచ్చఁగను శ్రీ • సుగ్రీవపట్టాభిషే
కము గల్పింపఁగఁజాలినాఁడవు సువా • క్యప్రౌఢితంగుల్కఁగా
సుమసారంబుస్రవింప నెందుగనినర్ • సొంపావహిల్లన్మదీ
యమనంబర్మిలిదేలెఁ ద్వత్కృతిని హ • స్తాబ్జంబునందుంచుటన్ 3

చ॥ కవనమునల్లుటేమిగుల • గష్టమదట్టులునుండనిండు, బు
ణ్యావశతనాలుగుందెఱఁ గు • లైన కవిత్వములుం బదెన్మిదా
ప్రవిలసితంపు వర్ణనలు, భాసిల గ్రంథముఁ జేయనబ్బె నే
ర్పు వెలయఁగాంచఁ బూర్వకవి. పుంగవతుల్యుఁడ వీవపోయిఁకన్

దీ 16-1-1913
తెనాలితాలూకా
చేవలి
రిజల్టుస్కూలు
హెడ్డుమాస్టరు,

ఇట్లు.
యుష్మత్సోదరుఁడు
అబ్బరాజు సీతారామశర్మ.
నిర్వచన సత్యనారాయణవిలాస గ్రంథకర్త.

10

గుంటూరుటవును హాయిస్కూలునందుఁ బ్రధానసంస్కృతోపా
ధ్యాయులును, నవధానిశిరోమణి ముఖాదిబిరుదాంచితులును, శతావ

నులును, నయిన బ్రహ్మశ్రీ కాశీ. కృష్ణాచార్యులు వారిట్లు వ్రాయుచున్నారు,

మ॥ సుమనఃకోమలకల్పనం జెలఁగుమీ ◆ "సుగ్రీవపట్టాభిషే
కము" నేఁజూచితిసట్టికైతలనునీ ◆ కాలమ్మునందల్లను
త్తముతౌ వారుగలారొకోయనెడుమ ◆ త్సందేహమే తెంచెఁజి
త్తముత్కృష్టింగ నెనబ్బరాజు హనుమం ◆ తా! ధీవరాగ్రేసరా!

తే॥ భట్టువాగ్ధాటియొకటఁగ ◆ న్పట్టె గణప;
వరపు వేంకటకవిసొంపు ◆ వఱలెనొకటఁ
బాండురంగవిజయభక్తి ◆ పర్వెనొకట
ద్వత్కవిత్వామృతాంబుని ◆ ధానమందు

21-1-13<br>గుంటూరు — అవధాని శిరోమణి<br>కాశీ. కృష్ణాచార్యులు.

11

సత్యహరిశ్చంద్రీయ సత్రాజితీయాద్యనేక నాటకగ్రంథకర్తగారును గుంటూరు చంద్రికాముద్రాశాలాధికారులును నగు బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతముగారిట్లు వ్రాయుచున్నారు.

మిత్రమా!

మీ "సుగ్రీవపట్టాభిషేక" మనుగ్రంథము దిట్టమైన ప్రబంధపాకమునఁ జమత్కృత కవితారీతులచే నలరారుచుఁ జదువరులకుఁ బ్రాచీనకవి మార్గముల స్మరణకుఁ దెచ్చుచున్నది. జల్లుఁబొల్లుంబల్కులతోఁ గవిత్వమల్లుట కలవాటుపడిన యీకాలంబున నీలాటి ప్రౌఢప్రబంధములు బయల్వెడలుటంజూచి మరల భాషాయోషకీషత్పుష్టిమ యలవరుచున్నదేమోయనితలంతు.

గుంటూరు<br>5—3—13 — ఇట్లు భవన్మిత్రుఁడు<br>బలిజేపల్లి లక్ష్మీకాంతము

## 12

రేపల్లెతాలూకా చెఱుకుపల్లిగ్రామ గ్రామణులును నాంధ్రభాషాభిలాషులును మన్మిత్రులును నయిన బ్రహ్మశ్రీ చెఱుకుపల్లి వేంకట కృష్ణయ్యగారిట్లు వ్రాయుచున్నారు.

మ॥ సుమగంధమ్ములు ఘుమ్మఘుమ్మనెడుత్వ ◆ "త్సుగ్రీవపట్టాభిషే
కము" లోఁగొన్నటిఁబద్యముల్ విని బలా ◆ త్కారమ్ముగాఁగర్ణరం
ధ్రములత్యాశఁ గథాసుధారసముజు ◆ ర్రాంబోవఁగాంక్షించుని
త్యమువహ్వా! హనుమంతరాయ! కవిరా ◆ డానందసంధాయకా!

మ॥ దినచూడామణిశిష్యుడై గగనవీ ◆ థిన్ మేనుఁబెంపొందఁ జెం
ది నవవ్యాకరణమ్ములంబఠిసమా ◆ ప్తింగాంచునయ్యంజనీ
తనయస్ఫారసుసార వాగ్విలసితో ◆ ద్యత్ప్రౌఢినీకబ్బె నీ
జనకుండుంగవిశేఖరుండగుటస్వే ◆ చ్ఛన్ సార్థకంబైనయీ
"హనుమంతాఖ్య" రచించెనిక్కముగ నా ◆ హాయబ్బరాడ్వంశజా!.

ఇట్లు భవన్మిత్రుఁడు.
చెఱుకుపల్లి వెంకటకృష్ణయ్య
అసిస్టాంటు కరణము.

31—1—13
చెఱుకుపల్లి.

## 13

రేపల్లెతాలూకా భట్టిప్రోలు బోర్డులిమెంటరీస్కూలులోఁ జతుర్థోపాధ్యాయులును, సంస్కృత పండితులును, మన్మిత్రులును, నైన బ్రహ్మశ్రీ బుఱ్ఱా పూర్ణయ్యశాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

శ్లో॥ అబ్బరాజాన్వయాంభోధి, రాకాశారదచంద్రమాః
హనూమన్నామధేయోసౌ, వ్యతానీద్గ్రంథముత్తమమ్

శ్లో॥ కవయస్సంతిబహవః, భాషాగ్రథనచాతురాః
నియమేననిరోష్ఠ్యాదేః, లభేతకథనం కథమ్.

శ్లో॥ విద్వాంసోబహవస్సంతు, పూజ్యాస్తు కవయఃపరం,
పూజితోభోజభూపేన, పండితేభ్యఃపరంకవిః. 3

శ్లో॥ స్థాలీపులాకన్యాయేన, వ్యలోకిభవదీయకం
సుగ్రీవరాజ్యప్రాప్తేస్తు, వర్ణనీయంతు వర్ణనమ్. 4

శ్లో॥ అర్థాలంకారిణః కేచిత్, శబ్దాలంకారిణఃపరే
ఓజఃప్రసాదప్రభృతిభిః, సర్వేపిసమలంకృతాః. 5

11—3—13 }
భట్టిప్రోలు }

ఇట్లువిద్వద్విధేయుఁడు,
బుఱ్ఱా పూర్ణయ్యశాస్త్రి.

## 14

బందరుతాలూకాలోఁజేరిన, స్మరణమాత్రాశేషకలుషాపహారిణులును, యథేచ్ఛావిహారిణులును, నగు కృష్ణా, వేణీపరివేష్టితపోతవరలంకవాస్తవ్యులును, ప్రస్తుతము కిష్కింధపాలెము బోర్డెలిమెంటరీ స్కూలుమాష్టరులును, మన్మిత్రులును, నైన కొమ్మరాజు కోటయ్యగారిట్లు వ్రాయుచున్నారు.

శా॥ శ్రీరమ్యంబగు బ్రహ్మవంశమున వా • సింజెందు "యార్వేలవా
రే రాశించిరి" సంస్కృతాంధ్రములఁజే • ర్మిం "గావ్యరత్నంబులన్"
ఘీరస్ఫారమతిన్ రచించి, మహినెం • తే, వారిలోఁజాలమీ
రారామించితి "రబ్బరాజు. హనుమం • తామాత్యచూడామణీ!"

మ॥ అనఘా! తామురచించినట్టి మహనీ • యంబౌ ప్రబంధంబు మా
ననిప్రేమంబునఁగాంచి నెమ్మది మ • హానందంబునుంబొంది తే
మనివర్ణింపఁగలాడ శైలియు, రసం, • బాబంధముల్, శబ్దగుం
భనముల్, మున్నగువానినెన్నవశమే • భావింపమాబోంట్లకున్. 2

శా॥ నాళీకాక్షపదారవింద భజనా • నంద్రైకలోలుండు, స
త్యాలాపుండగు "కుంచెపూడి • నరసింహాచార్య "శిష్యుండు, స
చ్ఛీలుండైన "పకీరయాఖ్యుఁడు" గరుణ్ • శ్రేయంబుధన్యత్వముం
హాళింగాంచను "మీకృతిం" గొనుటచే • హర్షానుసంధానుఁడై 3

చ॥ ధరణిసుతావిభుండు, జిత • దైత్యవిభుండగు రామచంద్రుఁడా
తరణిజుఁబ్రోచినట్లుగస • దాక్షపఁజూచుతఁ గూర్మిగాచుతన్
జరతరకీర్తియున్, సుతులు, • శ్రీయును, నాయువుఁబాడి,పంటయున్
వరమతికోసంగిబుధ • వత్సల! మిమ్మును, మీకృతీశ్వరున్. 4

క॥ మెప్పిడుమీకృతిఁగననా; కుప్పతిలినమోదమునన • నొసగితిమీకే
నిప్పంచరత్నములమది; మెప్పుగఁగైకొనఁగవలయు•మిత్రమ! కూర్మిన్

ది10—2—1913
కిష్కింధపాలెము



ఇట్లుభవన్మిత్రుఁడు,
కొమ్మరాజు కోటయ్య
ఆంధ్రభాషాభిలాషి

15

సరస్వతీపత్త్రికాధిపతులును, పోలవరసంస్థానాధిపతులునునైన మహారాజశ్రీబ్రహ్మశ్రీ కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావుబహుదూరువారి యాస్థానవిద్వాంసులును, కింకసీంద్రఘటాపంచాననాది బిరుదాంచితులును, శతావధానులునైన, బ్రహ్మశ్రీ దివాకర తిరుపతిశాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

శ్రీసుగ్రీవపట్టాభిషేకము.

ఇది అబ్బరాజు హనుమంతరావుగారిచే రచింపఁబడినకావ్యము. నవలాశకము, నాటకశకము, అనిపించుకొనిన యీకాలమునఁ గావ్యకర్తలైయున్న స్వల్పసంఖ్యాకులలో వీరొకరు.

మీఁదనిర్దుష్టమనియు, సరసమైనదనియునే మాయభిప్రాయము. శైలిదె లియుటకై కొన్ని పద్యములిందు దాహృతములగుచున్నవి.

| సరస్వతి<br>కాకినాడ<br>అక్టోబరు<br>191 | ఇట్లు<br>(దివాకర. తిరుపతిశాస్త్రి)<br>శతావధాని |
|---|---|

ఉ॥ మూకలుచుట్టుఁగొల్వ నెల • పూవుల తేనియలాని, జుట్టుపు
ల్గీకలఁగట్టువీవనల • నెంతయువీవఁగటాళి, తియ్యనా
దాకలపండ్లుదించుఁబువు • దండలఁదాల్చిముదబ్ధిఁదేలుచుక్
మూకలుతేఁడుఁబ్రొద్దుఠహిఁ • బుచ్చుచునుండిరిశైలనందనా!

ద్వి. అ. 94

ఉ॥ పాయనుఁబల్కు-కెగవెఱ • పాయను, భాళినిఁ గాంచకుంకుటిం
పాయనుఁబల్కు-వింతముఱ • పాయను, నవ్విరహాబ్ధిఁ దేల్చుతె
ప్పాయను, మేరమీరుటోఱ • పాయను నారతనాల మేవికు
ప్పాయను, మేలుఁగూర్పుమిఁక • పాయనుపాయుటనేరుపాయనుక్

ద్వి అ. 191

క॥ కమలాయతాక్షిసీతాం । మహావైభవముతో "నిమాంకన్యాంతు
భ్యమహంసంప్రదదే" యని । క్రమతం దాథారిఫ్రొసె రాముని

కెలమిక్ చ. అ. 68.

16

తెనాలినగరావాసులును, శతావధానాష్టావధానవిధానచాతు
రీధురీణులును, భీమేశ్వరపురాణాద్యనేకాంధ్ర కావ్యకర్తలునునైన
బ్రహ్మశ్రీ ముదిగొండ చంద్రమౌళిశాస్త్రిగారు శ్రీ సుగ్రీవపట్టాభిషేక
కృతివిమర్శన మొనర్చి

ఉ॥ కాలమతిక్రమించెనని ♦ గాఢతరాదరణంబుఁదప్పక
న్నీలలితప్రబంధపరి ♦ నిష్ఠితసౌష్ఠవమారగించు "న"
న్నోలిననుగ్రహించిమృదు ♦ లోజ్జ్వలముద్రితపుస్తకంబు నా
పాలికిఁబంపగోరెద, శు ♦ భంబగు "మీకును" "గ్రంథభర్తకున్"

అని వ్రాయుచు ముద్రించిన పొత్తమంపిన మీఁదనిట్లు వ్రాయుచున్నారు.

శా॥ శుద్ధాంధ్రప్రతిభావిభావితరసా ♦ స్తోకప్రబంధంబులి
శ్రద్ధాయుక్తముగా "నృగూదయముఁగా" ♦ రామారఁగాఁజేసెసం
శుద్ధప్రక్రియగాన పిదపసరశీఁసు ♦ గ్రీవపట్టాభిషే"
కోద్ధశ్రీకముకావ్యముంబిదపన ♦ యోగ్యుండగున్ 2

ఆ॥ అబ్బరాజవంశ్యు ♦ హనుమంతరాయని
కావ్యమరసిచూడఁ ♦ గాముదంబు
సంస్కృతాంధ్రకావ్య ♦ సాహిత్యవంతుల
కలరుసితరుతెలుఁగ ♦ రట్టిరీతి 3

తెనాలి 18-2-13 — ఇట్లు విద్వద్విధేయుఁడు
శతావధాని ముదిగొండ చంద్రమౌళిశాస్త్రి

17

శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకమను నీగ్రంథమైదాశ్వాసముల ప్రబంధము. ఈకృతికర్త జన్మభూమి వినుకొండతాలూకాలోని చిట్టాపురాగ్రహారము శ్రీవారు కొత్తపాలెము ప్రస్తుతమీయన రేపల్లెతాలూకా ఐల

వరమను గ్రామమున నారంభవిద్యాశాలయందు ప్రధానోపాధ్యాయుఁడుగానున్నాఁడు. ఇక్కవి కౌండిన్యస గోత్రుఁడు. ఆర్వేలనియోగిశాఖా బ్రాహ్మణుఁడు. అబ్బరాజ్వంశోద్భవుఁడు. శేషయామాత్యపుత్రుఁడు హనుమంతరాయనామధేయుఁడు ముప్పదిసంవత్సరముల వయస్సుగల వాఁడు. చిన్ననాటనుండియుఁ బండితుండును మాఘపురాణకృతికర్తయునగు జనకునిసన్నిధానమున విద్యాభ్యాస మొనర్చినాఁడు. నానావిధావధానకుశలుఁడు. చతుర్విధకవితానిర్వాహకుఁడు. పదునైదుసంవత్సరముల చిఱుతప్రాయముననే వాణీశతకము, హరిహరశతకము, నిరోష్ఠ్యపితృశతకము అనుశతకత్రయమును పదునెనిమిదవసంవత్సరమునఅచ్చాంధ్రనిర్గద్య నిరోష్ఠ్యనృగచరిత్రమును కవికర్ణపేయమును ఇరువదియాఱవసంవత్సరమున నంబరీషచరిత్రంబును ఇరువదితొమ్మిదవసంవత్సరమున నీసుగ్రీవపట్టాభిషేకమును రచించియున్నాఁడు. వెండియుశంకరకృత లక్ష్మీనృసింహస్తోత్రమును మార్కండేయకృతశివస్తవాదులను ఆంధ్రీకరించియున్నాఁడు. ఇవియన్నియు నముద్రితములే. వీనిలో నీసుగ్రీవపట్టాభిషేకమును కృష్ణాతీరస్థకిష్కింధాపురవాసియు నవరకులసంభవుండునగు పకీరయాభిధానుఁడు కృతిపొందుటచే నియ్యది శీఘ్రముగ ముద్రితమగుట తటస్థించినది. ఈకవికృతగ్రంథములలో నీగ్రంథమును ఇంతకుమున్ను రచింపఁబడిన నృగచరిత్రమును కవికర్ణపేయమును అక్కడక్కడస్థాలీపులాకన్యాయముగ నేనుచూచితిని. ఈసుగ్రీవపట్టాభిషేకమైదుమాసములలో ముగింపఁబడినది. దీనికథాసూత్ర మాంధ్రవాల్మీకి

యని ఆంధ్రదేశమున వన్నెగాంచిన బ్రహ్మశ్రీ వావికొలను సుబ్బరాట్క-వి శిరోభూషణఁకృతాంధ్ర వాల్మీకిరామాయణ కథననుసరించి యల్లఁబడినది. ఇందుమనుచరిత్ర, వసుచరిత్ర, విజయవిలాసము, బిల్హణీయము,మున్నగునుత్తమప్రౌఢ ప్రబంధపద్యసరముబురణించుపద్దెములనేకమచ్చటచ్చటఁగలవు. ఈకవికి అచ్చతెనుఁగునఁబ్రాఁఢముగను సరసముగను కబ్బనుల్లుసామర్థ్యము బాగుగనుండినట్లిందలి కొన్నిపద్యములవలన తేటపడుచున్నది. ఈయనకవిత్వము జాతీయములతోను, లోకోక్తులతోను, శబ్దార్థాలంకారములతోను గూడుకొని అక్కడక్కడనల్లికబిగింజెడగొట్టు జల్లిపదములఁగల్గియు మధురముగనేయున్నట్టు కన్పట్టుచున్నది. ఈయనకవిత్వధార నిరర్గళప్రచారముకల్దై వెలయుచున్నది. పాకముపరిపక్వగోస్తనీఫలపాకమని చెప్పనొప్పు.గ్రంథవామూలాగ్రముఁదిలకించినవారియ్యదిసరసముగ నున్నదని తలతురని నాయభిప్రాయము. రసగ్రహణపారీణులిందలిగుణములమాత్రము గ్రహించి ఈబాలకవికి ప్రోత్సాహముకలిగింతురుగాక. ఈశ్వరుఁడిక్కవికి ఆయురారోగ్యైశ్వర్యాదులనొసంగుఁగాక

ఇట్లు

తెనాలి
24—4—13

ఆంధ్రభాషాభిమాని
కొండముది శ్రీరాములు
ప్లీడరు

18

శ్రీశ్రీనివాసో విజయతే

గుంటూరు
2—3—13

మహారాజరాజశ్రీ అబ్బరాజు హనుమంతరావు పంతులుగారి సముఖమునకు పళ్ళె వేంకటసుబ్బారావు నమస్కారములు నాదిరమి

త్రులలో నొకరగు తమరు "సుగ్రీవపట్టాభిషేకమను" గ్రంథరాజము నొండు రచించి యాంధ్రప్రపంచమునకు మేలొనగూర్చి నందుకు తమరు వందనీయులు స్థాలీపులాకన్యాయముగ నక్కడక్కడ తమవలన వినగలిగినందుకుఁ జాలగసంతసించితిని, హృద్యపద్యగద్యంబులు ననవద్యంబులై యొప్పారుచున్నవి. భాషాభిమానులందరు దమకు నిట్టి ప్రబంధములు మఱికొన్ని రచించుటకు దగిన ప్రోత్సాహ మొసంగుదురుగాక.

ఇట్లు

భవన్మిత్రుఁడు.

పళ్ళె వేంకటసుబ్బారావు.

Bathina Venkaiah Naidu, Kollur, Tenali Taluq writes as follows:—I have gone carefully through the pages of your poetical works Sugreeva Pattabhishekam And I find it is a great plearure to congratulate my friend Astavadhani, A. Hanumantha Rao, the author. I find this book well written. And I have no doubt to call his name as "Kavi Rathnam" i would like that every Telugu—knowing man should have a copy of this good book with many thanks.

KOLLUR,
8th February 1913.

Yours truly,

B. VENKAIAH NAIDU.



శ్రీరస్తు.

శ్రీసీతారామాయనమః

# శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము

హనుమత్కృతీయము.

(ప్రథమాశ్వాసము.)

(ఇష్టదేవతాస్తుతి.)

శా॥ శ్రీముక్తిప్రదమైన కృష్ణదరిఁగి • ష్కింధాపురంబాదు సీ
తాముగ్ధాంగనతోడఁగూడి నిజభ • క్తవ్రాతముంబ్రోచు శ్రీ
రాముండర్మిలి, "నేల్లగడ్డకులపా • రావారరాకాసుధా
ధాముండైనపకీరయాహ్వాయు"నితాం • తశ్రీయుతుంజేయుతఁ॥ 1

సీ॥ మున్నుగాసవనోర్వి • మునులెన్నఁబాలించి
వెనుకసర్వంసహఁ • బెనిచినాఁడు
మున్నుగాగౌతమ • మునినహల్యనుగూర్చి
యటువెన్కనన్నుబెం • ప్లాడినాఁడు
మున్నుగానభిషేక • మునుగూర్చిరవిపట్టి
కవలఁదానభిషేక • మందినాఁడు
మున్నుగాభక్తుల • మురిపెమ్ముతోఁగాచి
పిదపబాంధవపాళిఁ • బెంచినాఁడు

తే॥ గీ॥ రమణుఁడనితానుగూడఁ మో • దమునమేటి
గుణులయినభక్తులకుఁగల్మిఁ • గూర్చుబోటి
ధర్మగుణమణిపేటి, సీ • తావధూటి
కోటయపకీరయకుసిరుల్ • గూర్చుధాటి॥ 2

క॥ శంకరుఁడు, భక్తచిత్తవ
శంకరుఁడు శివంకరుండు • సకలాంహానా

శంకరుఁడు, దానవైర్యవ
శంకరుఁడు కృతీశ్వరునకు ♦ శంకరుఁడగుతన్. 3

ఉ॥ తెల్లనివేల్పుటన్గుఁజెలి, ♦ తెల్లనితొయ్యలికన్నపెండ్ల, మా
తెల్లనివాక్రకున్ సవతి, ♦ తెల్లనితత్తడినెక్కుదంట, యా
నల్లనివేల్పుచెల్లె, లల ♦ నల్లనిమబ్బులయుబ్బుగెబ్బుబల్
నల్లనిమైగలట్టిలల ♦ నామణి, పేర్మిఁగృతీశుఁగాచుతన్॥ 4

మ॥ పొలయల్కంజెలిమాఁఖుమోమిడఁగ న ♦ ప్పూవుబోఁడివక్రాదులం
కలయంబోల్చికథన్ రచించి, నెటిదో ♦ ల్కం జిల్కుకుంబల్కు, యా
చెలియన్నేర్పుమెయింధగన్ సుముఖుఁగాఁ ♦ జేయంగఁజాల్నల్వశ్రీ
లొలయంగోటయనందనాగ్రణిమహా ♦ యుశ్రీయుతుం జేయుతన్॥ 5

మ॥ తనయా! నీసతిపొత్తుగాదిఁకను వి ♦ ద్యల్ గూర్తుసేనంచుఁదా
ననయంబుం, దలవాకిటన్నిలచు రా ♦ యత్తింట్ కోడల్ గదా
యన జాణా! పొరుగింటనుండఁగను లే ♦ దంచత్తయొగ్గించు, నా
వనజాతాసనురాణి, వాణి, కృతిరా ♦ డ్వ్యాఖ్యానముం జేరుతన్॥ 6

ఉ॥ పండితకీర్తనీయుఁడు, ప్రబ ♦ భాకరతేజుఁడు, నగ్రపూజ్యుఁడున్
ఖండితవిఘ్నసంచయుఁ, డ ♦ ఖండపటిష్ఠుఁడు వేదవేద్యుఁడున్
మండితపత్రికముంఁడును, స ♦ మస్తకళాధిపుఁడుం, గణేశుఁడా
చండితనూభవుం డెపుడు ♦ చక్కుతమత్కవితాంతరాయముల్॥ 7

శా॥ రాముండిచ్చినయుంగరంబుఁగొని, సం ♦ ద్రంబున్ వెసందాటి, సీ
తాముగ్ధాంగనఁగాంచి దానినిడిత ♦ ద్దైత్యేంద్రుప్రోలన్ మహో
ద్దాముం డైచరియించి, తద్రమణివా ♦ ర్తంబ్రేమతోఁబల్కు, శ్రీ
రామున్ మోదపయోధిఁదేల్చిన ఘనుం ♦ బ్రార్థింతునశ్రాంతమున్॥ 8

సంస్కృతకవిస్తుతి.

కంద్ర చా ♦ రిత్రమ్ముఁ దొలుదొల్తఁ
ప్రౌఢిమైనుడివెనే ♦ పండితుండు

స్రగ్ధర. శూద్రజనులుదరింపఁ బంచమవేద
మగుభారతముఁ బల్కెనపు డెవండు
కవిబృందములఁ జేర్చి కావ్యంబులల్లించి
దేవభాషకువన్నెఁ దెచ్చె నెవఁడు
కాళీప్రసాదంబుఁ గాంచి, మోదించి
సంస్కృతమునకుఁ మెఱుంగు నిడియె నెవఁడు
తే॥గీ॥ అట్టిపుట్టఁ బుట్టినకవి పట్టభద్రు
సత్యవతితొలిచూలైన సత్యముద్రు
రసికజనముఖ్యు శ్రీభోజ రాజచంద్రు
కాళిదాసునిఁ గొల్తు వి ఖ్యాతసాంద్రు॥ 9

ఆంధ్రకవిస్తుతి.

సీ॥ నవకవిత్వముఁ గూర్తు నన్నయ్యనన్నయ్య
బృథులవశీకృత భీముభీము
ధీరుంఘునన్న య్యె దిక్కన్న తిక్కన్న
సూరికదంబక సోముసోము
వరకాంతినిర్జిత భాస్కరుభాస్కరు
ముద్దుకేతవలఁపు మొల్లమొల్ల
వరబుద్ధిదైవత వరమంత్రియొఱమంత్రి
బుధనుతకవిరాజు పోతరాజు
సేవాభితోషిత శ్రీనాథుశ్రీనాథు
మహితసత్కవిముఖ్యు మల్లనాఖ్యుఁ
బేర్కొన్న కేతనుఁ బెద్దన్న పెద్దన్న
హృదయసంస్థితరామ కృష్ణుకృష్ణు
ఆ॥ తే॥ మహితహృదయసంగ మంగాంబ వెంగాంబ
ధృతివినిర్జితకవి తిమ్మసుకవి
విబుధులెన్నఁ దెలుగు వెలగన్న తెలగన్న
మఱిఁదలంతు నేను వదలకెంతు॥ 10

వర్తమానకవిస్తుతి.

తే॥ గుణసముద్రులవావిలి • కొలనుసుబ్బ
రాయ, కొక్కొండ వేంకట • రత్నశర్మ
దాసు శ్రీరామపండిత • దండికవులఁ
గందుకూరి వీరేశలిం • గమ్ముఁగొల్తు॥ 11

తే॥ వరుసఁ దిరుపతివేంకటే • శ్వరులఁగొలచి
కొప్పరపుసోదరకవులఁ • గోర్కెదలచి
గొలుతు ముదిగొండ, ములుకుట్ల • కులజులైన
చంద్రమౌళి, వేంకటకృష్ణ • శాస్త్రిలమది॥ 12

గురుస్తుతి.

ఉ॥ శ్రీకరు, నబ్బరాజకుల • సింధుసుధాకరుఁ గీర్తిదుగ్ధర
త్నాకరు, శేషయాహ్వయు, గు•ణాకరు, మాఘపురాణసత్తమాం
ధ్రీకరణప్రలబ్ధయశు • శ్రీవరసేవకు, బుద్ధిశేషద
ర్వీకరు, మద్గురూత్తముని • హృత్కమలంబున నెంతునర్మిలిన్॥ 13

భావికవిస్తుతి.

క॥ శ్రీమంతుల సకలగుణ
శ్రీమంతులఁగాంతియుతులఁ • జిరతరకవితా
శ్రీమంతులఁదతమేధా
శ్రీమంతులభావికవులఁ • జెలువుగఁదలఁతున్॥ 14

సుకవిప్రశంస

క॥ ఏకవులు నచ్చఁబల్కిన
నూకొనజాలకెదశంక • లొందెదరెపుడా
కాకవులమత్కృతపుఁగృతి
జేకొనకుండంగఁబత్తిఁ • జేజేసేతున్॥ 15

ప్రాజ్ఞులకొకవిజ్ఞాపనము.

క॥ నెరసులుదొరలకయుండఁగ
సరసులుమెచ్చంగఁగవిత • సాధింపఁగఁజాల్

సరసులగువారలఘుకఁగ
నెరసులుగలనాకవిత గ ♦ ణింపఁగనేలా! 17

ఉ॥ సూరిజనమ్ముమత్కవితఁ ♦ జూచిగుణమ్ముఁగ్రహించిమెచ్చి లోఁ
గూరిమిఁజెందఁజాలదొకొ ♦ కొందఱుజూచిగొణంగినంతనే
యేరచియింపకుండుటెటు ♦ లిందఱుమెచ్చఁగఁజేయనేనకా
దారయఁబ్రహ్మకైనఁదర ♦ మా! బుధులిద్దియెఱుంగకుందురా! ॥17

మిత్రప్రశంస.

శా॥ శ్రీమంగాంబకు సుబ్బరాయునకుఁబే♦ర్మింగూర్చు పుత్రుండు, ధీ
శ్రీమంతుం,డలకొమ్మరాజజనన ♦ శ్రీరాబ్ధిచంద్రుండు నా
శ్రీమత్కోటయమంత్రినెన్నఁదగదే ♦ చెన్నారమన్మిత్రు, నీ
శ్రీమత్కావ్యసతీనుఁజూపిన కృపా ♦ సింధుం, బుధశ్రేష్ఠునిన్॥ 18

స్వకీయవంశాభివర్ణనము.

సీ॥ సిరిదొరపొక్కిలి ♦ చెందమ్మిపూబెట్టె
నలుమోములుఁగల ♦ నలువపుట్టె
గడకవానికొలానఁ ♦ గౌండిన్యుఁడొకఁడుబుట్టె
నతనిసంతిలప్పైని ♦ నలమెనట్టె
యందారువేలవా ♦ రనుకుదురొకఁడుబుట్టె
నందబ్జరాజువా ♦ రలగిరట్టె
యక్కాలమ్మున వెంక ♦ యయనుమంతిరిపుట్టె
నహినాగొనాల్రత ♦ నాలపెట్టె
తే॥ కోరిశేషయ్యయనువానిఁ ♦ గొమరుఁగాంచె
నతఁడు బెనుపాపరావిద్దె ♦ యందుమించె
నిక్కమున, నాహరిశ్చంద్రుఁ ♦ డెక్కణంచెఁ
గైతఁదొలివేలుపులయొజ్జ ♦ గండడంచె॥ 19

క॥ అవ్వలఁతియు నరసమ్మను
జవ్వనిఁగేల్వట్టికాంచెఁ ♦ జక్కఁగొమరులన్

ముప్వూరఁ, బెరవేలుపుమును
ముప్వూరువేలుపులగాంచు ♦ పోలుపున నెంతేన్॥ 20

వ॥ వారలెవ్వరంటేని. 21

ఉ॥ ప్రెగ్గడమానికమ్ములగు ♦ వెంకయ, నర్సయ, కేశవుల్ కడుం
బగ్గెఁగలారు, విద్దియల ♦ బమ్మరుమీఱఁగలారు, జింకుతాల్
నిగ్గులమీఱుగీరితిని ♦ నేలను మించినవారు. వారిలో
నిగ్గుగఁబూన్చె, నర్సయకొ ♦ నెం,జెలిగాఁగను నెమ్మినమ్మకన్॥ 22

క॥ పుట్టినచోటికి, మఱియు
న్మెట్టినచోటికి, నసమ్మ ♦ నిండుగఁదెచ్చెం
జట్టన, నన్నా! గొనముల,
పుట్టననమ్మక్క వెలసెఁ ♦ బొలఁతుకలందున్॥ 23

ఉ॥ ఆమొలనాగయందు, నర ♦ సయ్యయునైదుగురంగొమాళ్లఁ, దా
మేమెడమేల్గొనమ్ములకు ♦ నిక్కలనందగువారి, వేల్పు జె
ట్లోయన మేలిగీరితిని ♦ నెప్పినవారిని, విద్దెఁగట్టువిల్
గాయనిమోముఁలోయనఁగ ♦ గ్రాలెడువారినిగాంచె నెంతయేన్॥ 24

వ. ఆప్రెగ్గడమానికంబులెవ్వరంటేని. 25

చ॥ వెడవిలుతుద్దిసుబ్బయయు ♦ వెంకయ, శేషయ, రామకృష్ణులి
వ్వడువుననుండఁగా మొదటి ♦ వారిరువుర్ గడనాసుపోయి, ర
వ్వడు బెగడందియుం,దిటవు ♦ వోయియుఁ శేషయరాములిర్వురెం
దుడుగని చెల్మిమైమెలఁగు ♦ చుండిరి విద్దెయుబుద్ధిగ్రాలఁగాన్॥ 26

వ. ఆయిరువురందు. 27

ఆ॥ కోర్కిభట్టరాజు ♦ గోవిందవేంకట
రాయలకునుదోషు ♦ నైమెసంగు
లచ్చుమాంబగన్నె ♦ లంతఁగారామయ్య
గని "నృసింహరావుఁ" ♦ గాంచిమించె॥ 28

క॥ వారల శేషాచలమెం
తేరహిపుట్టంగనులకుఁ ♦ దెలుగున్రావాసెం

మీరుగ "మాఘపురాణముఁ"
జేరఁగ నారాయణునకుఁ • జెన్నగుబత్తిన్॥ 29

సీ॥ నెరకయినెల బొగ్గ • వరపు సుబ్బయకు
సీతమ్మకర్మిలి • జేర్చఁబుట్టి
రహిని శ్రీరామశ • ర్మకు రంగయకుఁ బాప
హరికృష్ణులకుఁ దో • డగుచుఁ బుట్టి
చెలువార వెంకమ్మ • శేషమ్మ, రాజ్యల
క్ష్మీ మహాలక్ష్ముల • కెలన మెట్టి
నెమ్మి నివిద్దియ • నేర్చి తెలివికల్మి
వెరవరిమైతోలి • వేల్పుఁ బెట్టి

ఆ॥ వె॥ నెమ్మనమునఁ గాంచు • నెలఁతుక మంగమ్మఁ
జెట్టఁబట్టఁ గూర్మి • శేషయకయి
వెనుకను "మునిమాక • హనుమ" నెనరుసర
ణి విని "హనుమంతరావు" గాంచె॥ 30

ఉ॥ తీరయినట్టి కల్మిఁగడి • దేరిన దా వినుకొండసీమపీ
పూరునఁ బెద్దతల్లికడఁ • బుట్టితి, నంతట గ్రొత్తపాలె మొ
ప్పారఁగఁ జేరి పెద్దనయి • యవ్వలఁ జక్కని "దోనెపూడి" కిం
పారఁగ వచ్చి యొజ్జనయి • పావలవిద్దెల దేర్చి తెంతయేన్॥ 31

క॥ ఆకుప్పమునఁ గలారలు
నాకూరకఁ గూర్చుమేలు • నాగుట డయ్యెన్
వాకొన నేరఁడనంగా
నాకుం దరపహాసగ్రద్ధ • నంబలుకంగాన్॥ 32

స్వకృతపూర్వగ్రంథపట్టిక.

సీ॥ కొమరుప్రాయము మేనఁ • గునిసియాడెడునాఁడు
నెఱిబల్కినాఁడవా • శీశతకము
మునిమునిమీసమ్ము • మొలకలెత్తెడునాఁడు
సృజియించితిని రోష్ఠ్య • నృగచరితము

కన్నెప్రాయఁపుఁజెలి ♦ కాంగ్రఁదిరుగునాఁడు
నలకవికర్ణపే ♦ యమునుడివితి
మదిబత్తియొక్కటఁత ♦ పొదలుచుండిననాఁడు
వ్రాసితినే శ్రీనృ ♦ కేసరినుతి
తే॥ వెడియాంబరీషచరిత్ర ♦ పితృశతక, మ్మ
కందునందనస్తోత్రముల్ ♦ గల్పనమ్ము
సలిపినాఁడరమానాథ ♦ సత్కృపా వి
శేషమునసత్కవికృపా వి ♦ శేషమునన॥ 33

వ॥ అనియిష్టదేవతానమస్కారంబును, సుకవిజనపురస్కారంబును, కుకవిజనతిరస్కారంబును, గావించి, సుకవిజనానుమోదంబైన కావ్యంబొండు రచియింపందలంచి, మోదంబునమించి, సమస్తభక్తజనాధీనుండైన విరించి గురునెదనెంచుచున్నంత. 34

కృతిప్రశంస ద్వ్యర్థి.

సీ॥ గొప్పగోత్రంబునఁ ♦ గులవర్ధనియటంచు
సహజాతలెల్లమె ♦ చ్చంగఁబుట్టి
తండ్రియైనస్వగోత్ర ♦ తల్లజుముందఱ
మేలిజాడలమెల్ల ♦ మెల్లమెట్టి
ఘనతరులనుజేర ♦ జనన్నివేళులనుండి
చెదఱిగుణాఢ్యులఁ ♦ జెట్టబట్టి
నటదూర్మికాకంక ♦ ణాదులక్రొమ్మెఱుం
గులుగ్రాలఁగాఁజాలఁ ♦ గొనబుదట్టి
తే॥ కాశపుష్పాఖ్య వేణికా ♦ గరిమతోడఁ
బ్రబలతరతుంగభద్రాళి ♦ పదవితోడ
నెమ్మినవ్యక్తమధుర స్వ ♦ నమ్ముతోడఁ
బొలుచుగృష్ణానదియుఁ గృష్ణ ♦ కులుకుతోడ॥ 35

స్రగ్విణి. నెమ్మిపించెమ్మల ♦ న్నెమ్మిఁగట్టమ్మటం
చెమ్మెగుల్కంగఁబోం ♦ ట్లివ్వఁగాఁగొంచొగి

నమ్ములో జెల్లులో • న్నాగుడున్నా తల
బ్రమ్మగా నాడుచుం • గ్రాలుచెంతేదగన్ 36

ఉ॥ క్రుంకుచుదప్పకారునటు • గ్రోలుచునుండెడువారిపాపముల్
కొంకకయింత లేకుమపు • కొంచునుమోక్షమునిచ్చుచుంజగా
సంకులతోడనాశుగతి • సంద్రముజేరెడు కృష్ణవేణ్యమై
నింకొకధాతయేనియొక • యించుకయేనిదరంబెయెన్నగన్॥ 37

వ॥ అట్టికృష్ణానదీలలామమ్మునకుఁ గృష్ణవేణికి నడుమనొప్పారి తెలి దీవిపాలుపుదీటుచు సకలసంపదలఁ దులదూఁగు పెనుదీవియందు.

ఉ॥ ఎయ్యదిసంపదాన్వితము • నెయ్యదిసజ్జనవాసయోగ్యమిం
కెయ్యదిసత్యభూషణుల • కిల్లికనెయ్యది పుణ్యపుంగొటా
రెయ్యదిస్తోత్రపాత్రము, మ • తెయ్యదిసుందరమందిరాంచితం
బెయ్యదిశోభనోజ్వల, మ • దెయ్యదిపట్టణరాజమెన్నగన్॥ 39

సీ॥ ఏవీటికనిజెంత • నెల్లసంపదలతో
దీపించుజల్లప • ల్లీపురంబు
నేవీటికినిదాపు • లో వెలుంగొందుశ్రీ
కాకుళేశస్థల • కాకుళంబు
నేవీటికినిబక్క • తేవమీరునుమహా
స్థలమించు శ్వేతపు • రీవరంబు
నేవీటికినివెన్క • నవిఁగుల్కునుసోమ
లింగస్థకోటి ప • ల్లీపురంబు

తే॥ నేపురివిరించి, భార్గవా • హీనకటక
మిత్ర, హలపాణ, విజిత భూ • మీసుపర్వ
రాజ, వైశ్య, శూద్రజనాళి • గ్రాలుచుండు
నెసఁగనిలనట్టికిషిగంధ • నెన్నవశమె॥ 40

క॥ మఱియుగుణాఢ్యులు సరసులు
నెఱినెఱిఁగినవారు సకల • నీతికుశలు లం

దఱఘనులు నచటిపాఱులు
తెఱగంటులయొజ్జయుద్ది • తెలివినినెంతేఁ॥ 41

క॥ పరిషూదరణులు బంధుర
తరగుణవంతులు నమోఘ • ధైర్యస్వాంతుల్
శరణాగతరక్షణు లా
ర్యరతులు ధర్మగుణలక్ష్మి • గ్రాలుదురు నృపుల్॥ 42

క॥ శ్రీదగినకన్యకాంబా
పాదసరోజమధుపాన • పరభృంగతతుల్
భూదైవతప్రియులు త
చ్ఛ్రీదయితోరుజులు నెన్న • జెల్లదెవారిఁ॥ 43

క॥ హాలసంపదాన్వితులు మం
జులవిద్యాసంపదులు యశ• శోధనవంతుల్
వలతులు ధరణీసురప
క్షులు నచ్చటికమ్మవారు • కోవిదులెందుఁ॥ 44

క॥ శ్రీవృద్ధి సకలనీతిక
లావృద్ధిని సస్యవృద్ధిఁ • లక్ష్మీవృద్ధిఁ
గోవృద్ధిఁబుణ్యవృద్ధి సు
ధీవృద్ధినిఁదత్పురమ్ము• దెలివింగాంచెఁ॥ 45

వ॥ అట్టిపురవరంబునందు. 46

ఉ॥ శ్రీమహి జెల్లగడ్డకుల • సింధుసుధాకరుఁడచ్చకీర్తియు
క్తామలకమ్మవంశభవు • ఁడాయతభోగసురేశుఁ డర్థిసు
త్రామనగంబు, బుద్ధిసుర • రాట్సచివుండు "పకీరయాఖ్యు" ఁడెం
తేమహిమాన్వితుండగుచు • నిచ్చలుఁగ్రాలుఁగవీంద్రులెన్నఁగఁ॥

చ॥ వెలఁగలమేలుదూలములఁ • బెన్మకరమ్ములఁబూవుదీవలం
బలముగఁ జెక్కినట్టిపెను • ద్వారపునిల్వులలచ్చిపట్టెలం
బొలుపుగవారిసీసుఁగడు • బూసిమెఱుంగిడినట్టితల్పులం
గెలఁకులఁగాంతిఁగ్రాలుకిటి • కీలఁజెలంగినపెద్దమేఁడలోఁ॥ 47

ఉ॥ మేలిమిగవ్వసున్నమున • మిన్న • గనంతటఁ బాలగచ్చొగిం
ద్రాలఁగఁజేసి, చూరులజ • గా జిగితీగలఁజిల్కలంచలం
జాలఁగఁదీర్చి, చిత్రపట • జాలములారవివర్ణవర్ణ్యన
ద్దాలనునింపినట్టిగదిఁ • దండిగ నేఁడుగులోబులొప్పఁగన్॥ 48

మత్తకోకిల॥ చాలుగంగురిచీలు, బల్లలు • జాల్రగాలఁగఁజాలుబెం
చీలుమేల్చిలుచాపలందపుఁ • జేలలందగుచాందినీల్
క్రాలుచుండఁగ్రఁ బందుగుల్, చెలి • కాంగ్రడు బిన్నలుపెద్దలున్
బాలుదీరఁగఁజుట్టునుంగడు • బాగుమీరఁగఁగొల్వులోన్॥ 49

తోటకము॥ వ్యవహారఁపుఁజిక్కులు • బాపికొనం
దవులందనుగావులు • ధర్మముపై
జెవివించును నేర్పున • జెప్పిరహిం
గవులందగుమన్ననఁ • గాంచుచొగిన్॥ 50

శా॥ పౌరాణీకులుసర్వధర్మములు దె • ల్పన్వింపుఁదానిట్లనుం
గారాబంపుసకుంగోడాలికులు తెం • క్రత్నముంగాంచి జె
న్నారంగాఁజెలకాడ! ధాత్రిసతసం • తానములందేది తే
జారంజాలదినములుంపనో వచిం • చండర్తిలిన్నావుడున్॥ 51

మ॥ అపుడా వెంకటరత్నమిట్లనుబకీ • రాఖ్యా! వినుం డందఱున్
విపులస్వాంతుఁడు నీతికోవిదుఁడు, బృ • థ్వీదేవరత్నంబు శాం
తిపరుండార్యుఁడు కోటయాహ్వయుఁడు న • ర్థించెల్పఁగల్గన్న న
ప్పుపకీరయ్యయు వారిఁగాంచి, కృపదీ • ర్పుండీరుసందేహముల్॥ 52

మ॥ అనివేడంగరుణించివారు వినుఁ డ• య్యా! మీరునాసక్తితో
డను, సంతానములేడిటం గృహ•ముఖం • డంబైనసత్కీర్తినిం
బెనుచుం, బేరునునుండు, నట్లొసరుపం • బెంపెక్క రోభూపతుల్
వినుచుండంగను లేదొకోమనమును • ర్వింబెద్దలిట్లాడఁగాన్॥ 53

చ॥ అని, మనమింతకున్మునుపు • నన్కొనుచుండఁగఁ లేదొ, "దోనపూ
డిని" "హనుమంతరాయకవి" • కీవిఁగవిత్వముజెప్పఁగల్గునిం

కనునవధానముంజలు ప ♦ గల్గునటు, చలవారిఁబిల్వఁగ
న్బనుపఁగరాదొయొక్క కృతి ♦ వాటముగాఁగొనరాదొనావుడున్

సీ॥ శ్రీహారిపదకంజ ♦ సేవకుండగువాని
షట్సహస్రసమాఖ్య ♦ శాఖవానిఁ
పరుతరకౌండిన్య ♦ గోత్రజుండగువాని
నచ్చాంధ్రకవివరుం ♦ డైనవాని
దళచతుర్విధకవి ♦ త్వకుశలుండగువాని
నార్యానురంజనుం ♦ డైనవానిఁ
మునువినుకొండ సీ ♦ మనువసించినవాని
నట్టద్రోణపురినిల్చి ♦ నట్టివానిఁ
తే॥ మాఘమాహాత్మ్యకృతికర్త ♦ మంగభర్త
యైన శేషాచలాత్మజుం ♦ డైనవానిఁ
రాజిత " నిరోష్ఠ్య నృగచరి ♦ త్రకృతికర్త,,
నబ్బరాడ్డనుమంతగా ♦ వనెడువాని॥ 55

మ॥ అపుడే నన్బిలపింపఁగాఁ బనిచి నే ♦ య్యంబారఁ దోడ్కొంచుఁ బో
యి, పకీరాఖ్యుఁడు, స్వగృహంబునను న♦న్నింపారఁ బూజించిమీ
విపులంపుంగవితా మహత్త్వమును నే ♦ వింటిం గడుంగా భవ
న్నిపుణత్వంబు నెఱుంగుదున్మముగృపం ♦ దీవించిమన్నించుచున్॥ 56

క॥ కృతి పతినిఁజేయుఁడంచని యతిముదముననంద ఱాదుర ♦ నవనీతనయా
పతి సేవలఁదగుతనకై జతజోడించికడుబత్తిఁ ♦ జయ్యనఁబలికెన్॥ 57

వ॥ అనియిట్లుపల్కి కర్పూరతాంబూల జాంబూనదాంబ రాభరణాదు
లొసంగి సబహుమానంబుగ బహూకరించి రామాయణకథాంతర్గ
తంబగు "సుగ్రీవపట్టాభిషేకమ్ము,, సవిస్తరమ్ముగఁగావించి తద్గ్రంథం
బునకుఁ దన్నుఁగృతినాథుంగాఁ జేయవలయుననిపలుకుటయు నేనును
నపరిమితానంద కందళిత హృదయారవిందుండనై సంతసంబున నట్ల
కాకయని యేతత్కృతినాయకరత్నంబయిన యెల్లగడ్డ పకీరయా

భిధాను కమ్మకులప్రధాను వంశానుచరితం బభివర్ణింపందలంచితి
కదియెట్టిదనిన 58

* కృతిపతివంశాభివర్ణనము. *

క॥ శ్రీమజ్జలజజశివము ఖ్యామరచయసేవ్య,మనఘ•మమలమునివర
స్తోమధ్యేయంబఖిల క్షేమంకర, "మచ్యుతాంఘ్రి"•శివకరమెందున్॥
క॥ తత్పదకంజాతమున వి యత్పథ గామియగుగంగ • కనుజులగుచుశుం
భత్పథవర్తులుతద్విలసత్పదరతులైనశూద్ర • సంతతివొడమెన్॥ 60
వ॥ తచ్ఛూద్రసంతాన సంతానవృక్షంబంత శాఖోపశాఖా న్వితంబై
క్రాలుచుండు, నందు-హారమధ్యనాయకరత్నంబుబోనికమ్మవంశంబు
బెంపుమీరుచుండు. 61
సీ॥ ఇమ్మహినెల్లవం • శమ్ములకైకమ
త్యమ్ముమైందగువారు • కమ్మవారు
సమ్మతినెంతకా • ర్యమ్మైనఁజల్పంగఁ
గ్రమ్మఁగాఁగలవారు • కమ్మవారు
బమ్మతానురకంటి•కొమ్మలకిక్కలా
యుమ్మలఁదగువారు•కమ్మవారు
నెమ్మిమైనర్థిబృం •దమ్ములుప్పొంగవి
త్తమ్ములనిడువారు•కమ్మవారు॥
తే॥ దొమ్మిఁగెల్వఁగఁ గలవారు• కమ్మవారు
నెమ్మదినెనరుగలవారు • కమ్మవారు
తమ్మికంటిబత్తిఁ గలారు • కమ్మవారు
నెమ్మిలంగ్రాలఁగలవారు •కమ్మవారు॥ 62
శా॥ అంధ్రుంబొల్తురు నేల్లగడ్డకులులా • ర్యస్తోత్రపాత్రైకకీ
ర్త్యందుల్ దూగుచుసంపదాన్వితులు • సుక్షేమాభిరాముల్ కృపా
సింధుల్,బంధురవిక్రమోజ్జ్వలులు,నీ • క్షీణప్రభావాఢ్యు, లా
ర్యేందుల్ భోగసురేంద్రులచ్యుతపదా•బ్జేందిందిరశ్రేష్ఠులై॥ 63

తే॥ శ్రీమదైల్లగడ్డాన్వయ • క్షీరజలధి
పూర్ణిమాచంద్రుఁడై చాల • పొలుపుఁగాంచెఁ
దానుగంగాధరాఖ్యుండు • మానుగాను
క్షీరవారాశిశశివుట్టి • చెలఁగినట్టు॥ 64

శా॥ శ్రీగంగాధరపాదపద్మయుగళీ • సేవానుకూలుండు, వి
ద్యాగంభీరకవిప్రియుండు, విమతా • హంకారహారుండు, క
ల్పాగ్రశ్రేష్టసమానదానచణుఁడు • ద్యత్కీర్తివిస్తారుఁడై
శ్రీగంగాధరుఁడొప్పెఁజాలమహాల • క్ష్మీభాసితార్ధాంగుఁడై॥ 65

క॥ ఆజంపతులుపకీరయ
నాజనుపేరుఁగలకమ్మ • నాయకుఁగనిరా
శ్రీజలజాక్షుఁడుమున్నల
శ్రీజలజాంబకునిఁగన్న • చెలువున నెంతే॥ 66

చ॥ అతనిగుణమ్ములెన్నఁదర • మా! పర మాదరమానసుండు; దో
షితనిజబాంధవుండు గుణ • సింధువు, సింధువువిక్రముండు, బో
షితశ్రితబృందుఁడాఘనుఁడు • శేషశయానుఁడులక్ష్మిఁబోలెనం
చితమతిలక్ష్మిఁబెండ్లియయి • చేర్చెయశోధనమెంతయేనియుఁ॥ 67

ఉ॥ అంతపకీరయాహ్వయుఁడు • నాత్మసతీమణిలక్ష్మియందున
త్యంతముదంబునన్మహిత • ధార్మికవంతులశౌర్యవంతులం
గంతుసురూపధారులన • ఖండ చరిత్రులనాజిధారిణీ
కాంతుఁడువొలెనందనులఁ • గాంచెనునల్వురఁజుట్టలెన్నఁగ 68

వ॥ అక్కుమారరత్నంబులెవ్వరనిన. 69

సీ॥ గణనీయగుణమణి • గణవినిర్జితనదీ
గణనాయకుఁడు కులా • గ్రణిగణయ్య
దీనసంతానసం • తానభూజముదాన
కానీనుఁడెన్నంగ • జానకయ్య

సరసస్సజ్జనమాన్య • వరగుణాభరణుండు
స్మరసమానుఁడునర • సయ్యయార్య
వినుతమహాపుణ్య • ధనుఁడుబహుళదాన
చణుఁడలఘుండు నెం • చహనుమయ్య
తే॥ యన్నలువురందు హనుమయ్య • వన్నెఁగాంచెఁ
గరముభక్తినిఁబెద్దల • గారవించె
వాగ్విజృంభణముననుగీ • ష్పతినిమించె
ధర్మగుణమునఁ గీర్తియెం • తయువహించె॥ 70

క॥ ఆనుహితయశుఁడు బుచ్చాం
బామణిఁ గేల్వట్టిపుత్ర • మణియుగముఁగనెఁ
గీమహితుఁ బెద్దకోటయ
నామహితాత్ముఁడగుకోట • యాహ్వయునెమ్మిన్॥ 71

క॥ పేరులఁజెలువులగుణములఁ దీరుల,నడవడికలనొక • తీరుగఁదగియ
వ్వారలుతమ్మెన్నఁగఁబెర వారలునయవినయములను•వరలిరిమైత్రిన్

ఉ॥ కూరిమిమీఱఁబెద • కోటయకైకొనెనచ్చమాంబ నా
సూరివరేణ్యుసోదరుఁడు • సుందరిఁగాఁగొనెరాజమాంబ నా
భూరిగుణాఢ్యులున్, మహిత • పుణ్యులునొబలకృష్ణులిర్వుర
క్రూరచరిత్ర రేవతిని • రుక్మిణిఁ బెండిలియైనమాద్రిగన్॥ 73

వ॥ అందురాజమాంబాపతి కోటయాభిఖ్యుగుణమణి గణమ్ములెట్టివనిన

సీ॥ పరుని వేడఁగఁబోని • పద్మాక్షుఁడన్నచో
నతనివదాన్యత్వ • మడుగనేల
పెరకల్కిఁగోరని • సురవరుండన్నచో
నతనినడతచంద • మడుగనేల
కలకందు లెఱుఁగని • కలువఱేఁడన్నచో
నతనికళాశ్రీని • నడుగనేల
బొంకనిధర్మసం • భూతుఁడేనన్నచో
నతనివచశ్శుద్ధి • నడుగనేల॥

తే॥ యనుచుబుధులెన్నఁగీర్తిచే • నలరినట్టి
యేల్లగడ్డకులాంభోధి • హిమకరుఁడు
నైనకోటయ్యనెన్నంగ • నలవియగునె
వలువకైనను వేనోళ్ల • చిలువకైన॥ 75

వ॥ తద్భామామణి రజమాంబారత్న చరిత్రాదు లెట్టివనిన. 76

సీ॥ కొల్లికులాంబుధి • కుముదాప్తుఁడైనరా
మస్వామియేసతీ • మణికిఁదండ్రి
గొనములపెట్టె నాఁ • దనరునచ్చాంబికా
కలకంఠియేసాధ్వి • గన్నతల్లి
లక్ష్మీహృదబ్జరో • లంబుఁబు వెంకట
రత్నమేపతిసోద • రప్రవరుఁడు
నబలాశిరోరత్న • మైనరంగాంబయే
రాజీవనేత్రిగా • రాలచెల్లి
తే॥ యమరఁగానేల్లగడ్డ కు • లాబ్ధిచంద్రుఁ
డైనశ్రీకోటయాఖ్యు న • ర్ధాంగలక్ష్మి
యే కలికియయ్యెఁదద్రాజ • మేందువదన
గుణములెన్నంగఁదరమ బ్రదు • హిణరమణికి॥ 77

సీ॥ క్రొత్తడితనమున • నెత్తువచ్చునగాని
సొబగునసీమెకు • జోడదెట్లు
సొబగునసీమెకు • జోడువచ్చునకాని
తాలిమినీమెకుఁ • దరమదెట్లు
తాలిమినీమెకు • దరమువచ్చునకాని
సంపదనీమెకు • సవతదెట్లు
సంపదనీమెకుఁ • సవతువచ్చునకాని
వెరవునసీమెకు • దొరయదెట్లు
తే॥ లనుచుబుధులెన్నఁగా వసి • ష్ఠునినెలంత
మరునెలంత మరునెలంత • హరినెలంత

జనకికోటయయర్థాంగ • మనఁజెంలగు
రమ్యగుణమణినికురంబ • రాజమాంబ॥ 78

ఉత్సాహము. కోటయాహ్వయుండు తనదు • కోమ్మరాజమాంబతో
నీటలరఁగఁగలసిమెలసి • నింపుమదిని సుగుణపుం
బేటులనఁపుంజోటులార్య • బృందగేయు లెందుసుక
మేటులనఁగఁజాలుసుతుల • మెఱయనలుపురంగనెక॥ 79

వ॥ వారలెవ్వరనిన 80

ఉ॥ క్షీరసముద్రచంద్రసమ • కీర్తిపకీరయ కీర్తిసీయ వి
స్తారగుణుండుపిచ్చయ యు • దారుఁడు వెంకటరామయాఖ్యుఁడు
ర్వీరథపుత్రవిక్రముఁడు • వెంకయనాముఁడు నల్వురొప్పిరా
వీరవరేణ్యులైనరఘు • వీరులునల్వురపోల్కి మైత్రిమై॥ 81

ఉ॥ వారలలోఁబకీరయ ది • వాకరతేజుఁడు బంధుబృంద మం
దారుఁడు ధైర్యవంతుఁడు ను • దారుఁడు నీతిపరుండు గీర్తివి
స్తారుఁడు, భాగ్యవంతుఁడరి • దారుఁడు రాజమనందనుండు వి
స్తారగుణాభిరాముఁడు ర • సావిబుధోత్కరితోషితైతగెక॥ 82

సీ॥ నలజేని నింపుఁగ • ల్వలజేనిఁగమకంచు
నెవనిసోయగమసం • బవనియందు
మలసూపుమేటిచి • ల్వలసూపునగిమించు
నెవనిమహాభోగ • జవములెంపు
నగరాజునాదిప • న్నగరాజుహసియించు
నెవనిధైర్యప్రజ్ఞ • లెసఁగముంద్దు
కర్ణునిగోక్కిర్ణ • కర్ణునినదలించు
నెవనితేగముభూతి • యిందునందు

తే॥ నట్టినుతమన్య నతిగిఁఖ్య • నధికపుంఖ్య
నేల్లగడ్డకులాంభోధి • హిమమయూఖుఁ
డైనశ్రీపకరయనెన్న • నలవియగునె
ధాతకైనసరీసృప • నేతకైన॥ 83

సీ॥ చాటునఁబల్కు నా • చారమెన్నఁడు లేదు
ముందాడుటంతకు • ముందె లేదు
యొప్పినచోఁజల్ప • కుండుటెన్నఁడు లేదు
ముందొప్పుటంతకు • ముందె లేదు
యొకఁడలంతిగఁబల్క • నోర్చుటెన్నఁడు లేదు
సందిచ్చుటంతకు • ముందె లేదు
మెచ్చుచోఁగొంచెమ్ము • నిచ్చుటెన్నఁడు లేదు
బొట్లమెచ్చంతకు • ముందె లేదు
తే॥ అనుచుబుధులెన్నఁగీర్తిచే • నలరినట్టి
కలిమిఁగలయట్టి నెఱిగమ్మ • కొలఁపుజెట్టి
కోటయాఖ్యనితొలిపట్టి • గొనవుఁబేటి
యేల్లగడ్డపకీరయ్య • కేవరుసాటి॥ 84

వ॥ మఱియు నమ్మనీషిమణీకృతకార్యమ్ము లెవ్వియనిన. 85

సీ॥ వేయించెనెవ్వాఁడు • విపులాండజావళి
తోషింపఁగొమ్మావి • తోపొకండు
తీయించెనెవ్వాఁడు • ధృతి జంతుజాలమ్ము
దగఁబాపికొననూయిఁ • దగనొకండు
వ్రాయించెనెవ్వాఁడు • వరకవీంద్రులచేత
బురుషోత్తమస్తోత్ర • ములనుమెండు
చేయించెనెవ్వాఁడు • శివకేశవులకుత్స
వమ్ములునేత్రోత్స • వముగరెండు
తే॥ నెతఁడు గొబ్బరితోఁటవే • యించెమఱియు
నెతఁడు బండితసంతతి • నెసఁగనెనయు
నట్టిరాజాంబికాపుత్రుఁ • డైనమేటి
యేల్లగడ్డపకీరయ్య • కేవరుసాటి॥ 86

శా॥ శ్రీమద్వేములపల్లిలక్ష్మయకు ల • క్ష్మీవంతురాల్ నర్సమాం
బాముగ్ధాంగనకుంగుమారికయునై • మర్యాదకుందావునై

రామారత్నమునైన "ముత్యమ" బకీ • రయ్యాఖ్యఁ డెంతేఁగొనెన్
శ్రీమాణిక్యములక్ష్మినచ్యుతుఁడుముం • జేకొన్న చందమ్మునన్ ॥ 87

వ॥ ఆముత్యమాంబామణి గుణమణిగణంబు లెట్టివనిన 88

చ॥ మణిగదపుష్కరాక్షులను • మంజులభాషలభారతీసతీ
మణిగద కల్మినిందిరకు • మాద్రికదా తతశాంతిభూసతీ
మణిగద శక్తిమానిమణి • మాతకదాపతిభక్తిబంధుస్వ
ర్మణిగద యట్టిముత్యమన • మాననుఁగానఁజగాన నేనెటన్ ॥ 89

ఉ॥ ఆచెలిమిన్న నెన్నఁదర • మా!పరమాదరమానసాంబయా
హా చెలువమ్ము నావినయ • మానయ మాభయమాముదమ్ము పెం
పాచతురత్వమాకరుణ • జయాఘనమామనమాగుణమ్ము పెం
పాచలదానసంపుఁబోలు • పాతఘకామెలపామె కేతగున్ ॥ 90

క॥ ఆజంపతులిరువురకును భూజనములుమెచ్చఁబుత్ర•పుత్రికలెంతేన్
దేజనను గలిగిరైదుగురోజనుసిప్పటికిముద్దు • నొసఁగఁగలారై ॥ 91

ఉ॥ వెండియువారలెవ్వరన • వెంకటరత్నము బుచ్చికోటయా
ఖ్యుండభిరూపలక్ష్మియన • నొప్పినవెంకటనర్సమాంబయుం
గొండికచుక్కమాంబ కడు • గొండికరాజమయొప్పి రెంతయే
మొండుగ బాల్యచేష్టనెల • మింజెలిపించు దముంగణింపఁగాన్ ॥ 92

తే॥ పొందుకాండ్రతో నల్లారు • ముద్దుగాఁగ
నుండితల్లిడుమట్టున • కొండునాక
గుడిచిచదువుకొనుచున్నాఁడు • కొంద్రువారు
మించిపూబుట్టఁగ బరిమ • ళించుఁగావె 93

సీ॥ సేవాభిశోభిత • శ్రీరామచంద్రుండు
చంద్రుండుగణనీయ • సాంద్రకీర్తిఁ
నవిబుధాంభోరుహా • కరపరమిత్రుండు
మిత్రుండుబాంధవ • మిత్రతతికి
నానతదీనసం • తానసంతానమ్ము
తానమ్ముగుణసమ • దాయమునకుఁ

బొగడొందిననిదాన • మునకునిదానమ్ము
దానమ్మునఘనుండు • తరముతనకు
తే॥ నెవ్వఁడయ్యేల్లగడ్డకు • లీనుఁడార్య
గేయకృతకార్యుఁడట్టి ప • కీరయమహిఁ
దతకళాసంపదమల సం • తానవృద్ధి
వరలె వరలుచున్నాఁడు • వరలఁగలఁడు ॥ 94

వ॥ మఱియు నయ్యేల్లగడ్డ పకీరయాభిధానుండు 95

క॥ చేసెనుసత్కార్యంబులు చేసెనుహరికర్పణముగఁ • జేతలవెన్నో
చేసెనుపకారమొరులకుఁ జేసెనుదానమ్ములెన్నొ • చెప్పఁగఁదరమా!

క॥ శ్రీమహిజామాతయురహి
నీమహిని బకీరయాఖ్యు • నెల్లయపుడిటుల్
శ్రీమహితకార్యసమితినిఁ
బ్రేమహితమ్ముమయిఁదిఱుఁగ • వేమరుఁజేయుక్ ॥ 97

# షష్ట్యంతములు

క॥ ఈదృశగుణవంతునకు మృ
గీదృశమన్మథున కమల • కీర్తివిధునకుక్
సాదరునకుమత్కృతకవి
తాదరునకు "శ్రీపకీర • యాభిఖ్యునకుక్" ॥ 98

తోటకము. నుతదివ్యగుణౌఘుమ • నోజ్ఞునకుం
జతనైరునకంచిత • చిత్తునకుక్
శతతాంచితకీర్తివి • చారునకుం
దతకమ్మకులాబ్ధిసు • ధానిధికిక్ ॥ 99

క॥ కృతపుణ్యావిశేషునకును
కృతకర్మానుభవునకుని • కృత్తరిపునకుం
ధృతవిమలగుణునకుం గర
కృతమత్కృతకృతికి నార్య • బృందహితునకుక్ ॥ 100

తోటకము. అనఘైకగుణాలగడ్డ కు • లాంబుధిచం
ద్రునకుం బుధబృందవి • నోదునకుః
ఘనదానవినిర్జిత • కర్ణునకుః
పెనుకల్మలముత్యము • పెన్మిటికిః ॥ 101

క॥ కేచర్లగోత్రభవునకు
ధీచరణాబ్జతలవిచర • ధీయుతునకు నా
రా
ధీచతురునకు గురుపాద • తీర్థహితునకుః ॥ 102

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన "శ్రీమత్సుగ్రీవ పట్టాభిషేకమ్ము" నాఁబఱుమహా ప్రబంధంబునకుఁ గధావిధానం బెట్టిదనిన. 103

• కథా ప్రారంభము ••

క॥ శ్రీమెఱయఁగఁ బదరీవన
భూమధ్యమునందుయాగ • ముంజల్పుచుఁవి
ద్యామహితుసూతుచేతః
క్షేమనుసత్కథల నెల్ల • వినివిని వేడ్కః ॥ 104

ఉ॥ శౌనకముఖ్యులక్కథల • సంస్తవముంబొనరించి సూత! సు
జ్ఞానకళాసమేత! రఘు • సత్తము చెల్మియొనర్చి వాలి బీ
రాసదురానరాల్చి కపి • రాజ్యము నేలినవాని శ్రీరమా
జానికథావిధానము వె • సన్వినిపింపవెమాకునాప్రుడుః ॥ 105

చ॥ మునివరులార! మీరిపుడు • ముచ్చటచేసినలాగు మున్ను శం
భునిష్ఠరవర్ణిసీమణి శి • వుంగని ప్రశ్నమొనర్ప నాహిమా
వనిధరునన్గుటల్లుఁడు భ • వానికిఁగూరిమిఁ బల్కె నట్లునే
వినిచెదఁ మీకునక్కథ స • విస్తరమాగతినాలకింపరే॥ 106

వ॥ అని కొండరాచూలికిఁ గుండలికుండలుండు పలికినవడువున సూతుండు శౌనకాదులకిట్లని చెప్పందొడంగె 107

## మేరుపర్వతవర్ణనము.

క॥ ద్వీపములమధ్య జంబూ
ద్వీపమ్ములరారు మిగుల • దీపించెడునా
ద్వీపమునడుమను మేరువు
ద్యోపదమధ్యమునఁ గ్రాలు • ద్యుమణి తెఱఁగునన్॥ 108

శా॥ భూపద్మంబునఁ గర్ణికాకృతినిజం • బూద్వీపమధ్యంబునం
దీపించుం దపనీయశైలము ధరి • త్రీధాత్రీవతంసంబు నా
శ్రీపద్మాక్షుభవావతారమనఁగాఁ • జేజేలపెన్నిక్క నా
దీపింపం దివిజాంగనామణులు నౌ • తేనాడుపూఁదోఁటనాన్॥ 109

విభూతి. లక్షయోజనోన్నతిం దక్షకన్యకామణీ
పక్షుకార్ముకోత్తమం బీక్షణీయమయ్యెడిన్॥ 110

సీ॥ ప్రాఙ్ముఖమ్మందున • భంగశృంగములతోఁ
గులుకుజఠర దేవ • కూటములును
దక్షిణముఖమునం • దక్షిణవృషాళి
కైలాస కరవీర • శైలములును
బశ్చిమముఖమునఁ • బర్వతశ్రేష్ఠమ్ము
లైన పవన పారి • యాత్రములును
నుత్తరముఖమునం • దుత్తుంగశృంగస
మన్విత త్రిశృంగ • మకరములును
తే॥ బ్రాచిని నవాచిని బ్రతీచి • రహినుదీచి
ఘనపరిస్తరణమ్ములఁ • గ్రాలునగ్ని
గతివెలుఁగుచు శాత్రవా • గమ్యమగుచు
నఖిలచిత్రాస్పదసురాల • యంబుదనరు॥ 111

## బ్రహ్మపట్టణవర్ణన.

క॥ పదివేలామడలనిడివి। బదివేలామడలవిరివిఁ • బాటిలిసొగసై
యుదిరిఁజగిబొజ్జవేలుపు। కుదిరినెలవు గ్రాలుచుండు • నొకడలమలపైన్॥

సీ॥ పెరసత్తిబొమ్మల ♦ పెండ్లిండ్లుసేయుచో
వండఁగానిడుకడ ♦ కుండనాఁగ
నలకాలమనెడు ప్రే ♦ జెలిదధినమ్మనె
త్తిననిడ్డతుదపెర్వు ♦ పనటినాఁగ
ముక్తికాంతామణి ♦ ముకురంబులఁగూడు
మించుటద్దాలపై ♦ మేడనాఁగ
దళిగారడీఁడు చి ♦ త్రముగానొనర్చిన
చక్కనినెత్తంపు ♦ టిక్కనాఁగ
తే॥ విశ్వరూపుఁగుదలఁదాల్చు ♦ వెల్లపట్టు
ముత్తెపుగొడుగుపైఁబొల్చు ♦ పుత్తడిజిగి
కొప్రమననలపొనుగట్టు ♦ కొట్టకొనను
రంజిలెడుడంబుననునిక్కఁ ♦ పుంజగంబు॥ 113

సీ॥ పూర్వదక్షిణములఁ ♦ బురుహూతపితృనేతృ
భర్మనిర్మితహర్మ్య ♦ పట్టణములు
పశ్చిమోత్తరముల ♦ వారిధీశ ధనేశ
భర్మనిర్మితహర్మ్య ♦ పట్టణములు
నాగ్నేయ నైఋతు ♦ లందగ్ని కోణప
భర్మనిర్మితహర్మ్య ♦ పట్టణములు
పవన భర్గాశల ♦ శ్వసనదుర్గాధీశ
భర్మనిర్మితహర్మ్య ♦ పట్టణములు
తే॥ డాంబుమీఱఁదదీయపు ♦ రంబులందు
మేటియైవిష్ణుశివపురీ ♦ ఘాటిమీఱ
నాఁటినాఁటికిశ్రీవిద్య ♦ నేటిలి కడు
సీటలరునల్వపెనుపీడు ♦ సాటిదీటి 114

శా॥ విన్నే అప్పూరిప్రాచిఁబాళినసితా ♦ భిఖ్యంబ్రదీచింబడిం
జన్నంజతుపుసంజ్ఞ నుత్తరమునం ♦ జారంగభద్రాఖ్య న

న్న న్నా! దక్షిణమేఁగఁగానలకనం • దాఖ్యాతినింగాంచె నా
పున్నెంపుంగనిదైన ప్రోలిమహిమన్ • భూషింపఁగా నేరికా॥ 115

ఉ॥ హాటకరత్నసంఘటిత • హర్మ్యవిధూపలరమ్యవేదికా
ఝాటకనద్విసీలమణి • జాలసమన్వితకుడ్యగేహళీ
ఝాటకవాటభర్మమణి • సంఘటితోజ్వలసాలవీధికా
నాటకశాస్త్రశాలలఁ ఘ • నంబుచుఁ బొల్చెఁబురీవరంబొగిన్॥ 116

బ్రహ్మసభావర్ణన.

చ॥ అలపుటభేదనమ్మున మ • హారజితోజ్వలసౌధరాజమం
దలపురుహూతురచ్చ యగు • నందఁపుటోలగమందు నెందునుం
దలపునకందనట్టివిభు • తంగనకాంబుజపీఠమందుబల్
వలపులఁ గుమ్మరించుచెలు • వల్కయిదండలవీవవీవనల్॥ 117

మ॥ ఒకవంకందివిజోత్తముల్ విపులమో • దోపేతులై కొల్వ వే
రొకవంకందటినీవధూటులుఁగుబ్జ • ద్వ్యూహమ్ములుంగొల్వఁ గాం
డొకవంకంజటిలల్లజావళిసభ • క్కృత్యకృత్యల్ పిసాళింపని ం
కొకవంకందివిజాంగనల్ నటనముల్ • ప్రోద్యద్గతింజల్పఁగాన్ 118

క॥ మఱియుంబురాణపురుషులు
ధరణీరుహజాలముల్ల • తాసంచయముల్
నిరతంబుఁభక్తిఁగొలువఁగ
వరరూపములన్వహించి • వైభవమెసఁగన్॥ 119

సీ॥ ఒకమొకంబొకవంక • సకలాగమరహస్య
ములుమహామునులతో • ముచ్చటింప
నొకమొకంబొకవంక • నకలుషోపబ్రహ్మ
లకుసృష్టిమర్మముల్ • రహింవదింప
నొకమొకంబొకవంక • స్వకుమారకులతో ర
మేశుతత్వంబెల్ల • నెచ్చరింప
నొకమొకంబొకవంక • నొగిఁగళత్రమ్ముతో
మెచ్చుగానరొమ్మకు • లుచ్చరింప

ఆ॥ వె॥ చతురతన్మలంగి • చతురాస్యనామమ్మ
సార్థకంబొనర్చి • జలజజుండు
కొల్వుఁదీరిమిత్రులఁ • గోమరారి దితిజారిఁ
జక్రధారిఁదలఁచి • స్వాంతమందు 120

ఉ॥ తారకయోగనిశ్చలతఁ • దాలిచి గాఢసమాధినిష్ఠఁదృ
క్సారసముల్ మొగిడ్చి యల • శార్ఙ్గధరున్మదినిల్పి ధ్యానమా
దారినిసల్పుచల్వకనుదమ్ములఁజాఱెఁబ్రమోదబాష్పముల్
వారిజపత్రముం దొరఁగు • వారికణంబులవారినంతలోన్॥ 121

ఆ॥ వానినేలపైని • బడనీకదోసిలిబట్టి చిత్రముగను • బుట్టెనందు
ఋక్షవిరజుఁడనెడు • వృక్షచరుఁడొకఁడాదికాలమందు • హార్యతనయ॥

క॥ ఆనందనుసజ్జనసిచ యానందనుగాంచిచాల • యక్కటికముతో
నానందముననువనులశతానందుండురిదుమంచు • నాజ్ఞయొసంగెన్॥

క॥ హాటకనగవనములఁ బా
హాటమ్మగమధుప్రమధుర • మహాఫలములఁ దా
నోటికిఁదొరకినకొలఁదిని
మాటికినాతండుగొంచు • మనుచుండు నెడన్॥ 124

వనవర్ణన.

క॥ ఒకనాఁడాతరుచరమణి సకలాటవులఁజెరలాడి • చయ్యననలహా
టకశైలోత్తరశృంగవి నికటమ్మునఁగాంచె సురవ • నీరాజమునన్॥

ఉ॥ సాలరసాలసాలసుర • సాలవినీలతమాలజాల హిం
తాలపలాశబాలవట • తాలవిశాలపటీరపాటలై
లాలవలీలవంగనవ • లాంగలలాంగలినారికేళ పా
శీలలితార్జునామ్లకద • ళీతరుశోభితమావనీస్థలిన్ 126

మధురగతిరగడ

మఱియునలరువని • మల్లెలమొల్లల నెఱిగ్రొమ్మావుల • నీటగుపొన్నలఁ
బెంపుసంపెంగలఁ • బాగగునీడెల నలువగుబొగడల • నవకాంచనముల
శ్రీకందములగు • శ్రీచందనముల మాకందములగు • మాకందమ్ముల

మారేడుల నెల♦మాదీఫలముల నేరేడులఁ బలు♦నిమ్మలఁ జిన్నలఁ
బనసల ననటులఁ♦బలుదానిమ్మలఁ జనుపకములఁ బెను♦జామల నాసల
కజ్జూరమ్ములఁ♦గమ్మని రేగులఁ గొజ్జంగుల నా♦కుందీవల నెల
బోఁకలఁ దీరగు♦బూరుగ మ్రాకులఁ దాకల రేలల♦దగు విరవాదులఁ
దగిసకలర్తుల♦ధర్మంబుల నెల జిగురుల మొగడలఁ♦జెలువఁ బుటలరులఁ
బిందెలఁ గాయలఁ♦బొంపుల నింపులఁ గ్రందుగఁ గ్రాలెడు♦గాటఁపుఁ దోఁపుల
మెలఁగుర మానుతు ♦ మేలిమిహాయముల
ములయును మానుతు♦మావుల మావుల
మేలిమి జివ్వురుల♦మెసవుచు నెలఁతల మాలిమి చేతను♦మావుల చివురుల
వావిరి నొసగు నె♦పంబునఁ గాంతల మోవిఁ గఱచు పర♦పుష్పనివహములఁ
జీఁకటి మ్రాకుల♦జవురుం గుంపుల వీకఁ గనుంగొని♦వేగల్ ముబ్బుల
కాఁగలవని పురిఁ♦గలయు విదిర్చిల నాగకఁడమితో♦నాడెడు నెమ్మల
మాపటి వేళల♦మండెడు నెండల కోపఁగఁ జాలక♦నొక్కటఁ దప్పలఁ
గోమల తరఁపుఁ♦గోకనదమ్ములఁ దామర పువ్వులఁ♦ద్రావఁగఁ దేనెల
కుసుదిగి ప్రొద్దటు♦గ్రుంకుట మనములఁ గనుగొనఁ జాలక♦గడపుచు రేయల
క్రొన్ననలందు స♦రోవరలక్ష్మల సన్నవఫుల్లా♦బ్జకరమ్ముల నెల
ముంగురుల నెఱిని♦బుచ్చిన రీతులఁ జెంగున నెజ్జని♦జేజేకరముల
చెలిమిని బ్రొద్దున♦జెందమ్ములుగలు వలునొక్కట దెరు♦వగ నెమ్మోములు
నందులనుండియు♦నలరెడు మ్రోతల గ్రందుగ లేచెడు♦భ్రమరనివహముల
దెల్లని తమ్ములఁ♦దెల్లని కలువలఁ నల్లని కలువల♦నల్లని నాచులఁ
జలచరజంతులఁ♦జలచర పక్షుల నలరారెడు కమ♦లాకర చయములఁ
గమలాకరయులఁ♦గల సారసములఁ విమలోత్పలములఁ♦బ్మధువసఘలముల
సౌరభములఁ గొని♦చక్కని నడకలఁ దీరుగఁ దిరిగెడు♦దెమ్మెర పిన్నలఁ 127

ఉ॥ ఆవనజాసనాత్మజుఁడు♦నాత్మవికారపుఁ జేష్టలన్వనీ
పావనభూరుహావళిని♦ప్రాకుచుఁ దేనె పెఱళ్లి రేఁపుచుం
జీవనముల్ రహింగనక♦జిహ్వాయు నొడఁగ నెంత్రొదప్పిచే
జీవనజాకరాళికయి♦చెంతవనాంతరమందు క్రుమ్మరెన్॥ 128

వ॥ ఇట్లు క్రుమ్మరిక్రుమ్మరి 129

సరోవరవర్ణన.

ఉ॥ బంగరుబొజ్జవేల్పునుఁగు • బట్టికనుంగొనె మ్రోలఁ బాలసా
రంగరుచిప్రకీర్ణమక • రందయుతోత్పలపంకజావళీ
సంగతసారభప్రకర•సంభృతిమందసమీరము న్మహా
భంగతరంగసంగవిధి•వాహనముం గమలాకరమ్ము గిన్॥ 130

క॥ మిన్నేటిచెన్ను నంగడు కన్నులపండువు ఘటింపఁ•గాసారమునన్
మున్నుతనుప్రక్షాళన మున్నడపి పిపాసఁ బాపెఁ•ముదమునవలన్॥

చ॥ జలములఁ గ్రోలయంత మెయి•చాయసరోవరమందుఁ దోఁపఁగాఁ
బలముగఁ బొంచికాంచి జడ • భావముతోఁ బెఱకోతితన్ను వే
చలమునబట్టవచ్చెనని • సక్రుధయైజలమందుఁ దూకి యా
జలముల నెవ్వరింగనఁగ • జాలక యూరక దూకితం చెదన్॥ 132

ఋక్షువిరజుండు స్త్రీయగుట.

తే॥ తలచిఘనవజ్రసోపాన • తతులఁ జేరి
నిలచినంతసరోవర • నలవిహారి
రాగమునఁ హరి నెదఁగోరి • రామయయ్యె
నాగనొక్కకులుకు కులు • నాగయయ్యె॥ 133

సీ॥ గొదమతుమ్మెదరెక్క • గొదవెన్ను నునుగొప్పు
పుండరీకమునవ్వు • మోము చెప్పు
కోకిలమిలకుసిగ్గు • గొల్పుకన్గవయొప్పు
కలితశంఖమ్మునెల్ • గళము మెప్పు
చెందమ్మిమొగ్గలబోల్ • చేదోయికడుఁ జెక్కు
కటినాఁడు నెంచునూ • గారుఁ జెక్కు
జిక్కవకవనవ్వు • చందోయినుందళుక్కు
నలువశాబాలబోల్ • నడలకుల్కు

తే॥ తలపఁగమలాకరమ్ములోఁ • గలుగువస్తు
జంతుసంతతికలసియా • చందమునను

మెలఁతరూపువహించెనో • మేదినిపయి
నాగఁదనరారునాయెల • నాగతీరు॥ 134

ఉ॥ తమ్ములుపాణులేనుఁగుల • తమ్ములునెన్నడలెన్నఁజాలగు
త్తమ్ములుగుబ్బలంగజమ • తమ్ములుచేష్టలుకమ్మవిల్తుచే
తమ్ములుజూపులాత్మకుహి • తమ్ములుపల్కులుతేనెదిండిమె
త్తమ్ములువెంద్రుకల్సువిత • తమ్ములుమేలిపిఱుందులింతికిన్ 135

క॥ నెలనోముమోముజిగివె న్నెలనవ్వేడునవ్వుజవ్వ • నెఱిబంగరుగి
న్నెలఁగెబ్బుగుబ్బకవతి న్నెలచందపుబలుపిఱుందు• నెలతుకకెతగున్

తే॥ సుందరముదరమునకన్నఁ • గంధరమ్ము
గంధరమునెన్నబహుఁగొప్ప • బంధురమ్ము
బంధురమునెన్నగనడ • మంథరమ్ము
మంథరముగబ్బిగుబ్బల • సుందరమ్ము॥ 137

సీ॥ తనమేనిధగధగల్ • వనజాంబకునినైన
ఘనమోహవార్ధిలో • మునుఁగఁజేయఁ
దననవ్వుచకచకల్ • వనజాహితునినైన
ఘనరాగజలధిలోఁ • మునుఁగఁజేయఁ
దనమేనిబుగబుగల్ • వినుకొమాగునినైన
వలపుటేటఁబడంగఁ • దలపుసేయఁ
దనచూపుమిసమిసల్ • తద్వసంతునినైన
స్మరవికారమ్ముల • మసలఁజేయఁ
తే॥ దన్నునోకతూరికనులారఁ • దడవికాంచు
నెట్టిఝగ్రతేజుండో ము • నీంద్రుఁడైన
మరునిబారినిఁదోయఁజాల్ • తరుచరమణి
రమణియైయుందువిహరించు • సమయమందు 138

చ॥ నళినజుఁగొల్వఁగాఁజని య • నంతపథమ్మునసేగునింద్రుఁడున్
నళినహితుండుగాంచిరి క • నత్కనకాంగిగురంగలోచనన్

నళినము శీర్ణగోపమము • న స్తని బల్లవపాణిఁ దేవతా
నళినదృశోపమానమృదు • నవ్యశరీరిని మంజువాణినిన్ 139

ఇంద్రసూర్యులు తదీయకాంతం గాంచి ముచ్చటించుట.

వ॥ ఇట్టులాప్లవంగకన్యకామణిం గనుంగొని దానిసోయగంబునకు నిరువురు మనమ్ములం జొక్కి యున్నంతఁ శచీమనోహరుండు ఛాయామనోహరున కిట్లనియె॥ 140

ఉ॥ ఆ తెలిగంటిఁ గంటివె యహర్పతి! దానియొడల్ హొయల్ మఱిం
కే తెలిగంటికైనఁ గల • దే! తలపోయఁగ నానొసల్ బెడం
గా తెలిగంటిసోయగము • నాచను కట్టుపసందునున్న దే
నా తెలిగంటిపిండునకు • నాగుటొయారులకింత యేనియున్॥ 141

శా॥ ఆమాటల్ విని సూర్యుఁ డిట్లను మహా • త్మా! నీకు నేమందుఁ గ్రే
నీమాటల్ నిజమాయె యారిసొబగు • న్నే గాంచిలో నెంచితీ
రామారత్నముతోడ సీడయినయే • రామం గనం లేదహా!
యీమాద్యత్పికవాణి నెట్టిమహితుం • డేలంగఁ దానోచెనో॥ 142

క॥ ఆనిస్వర్గ్రహపతులిరువురుఁ దనివిసనక సాప్లవంగ • తామరసాక్షీ
మణిసొబగు నెన్ని మోహాఁ బ్ధినిఁ దోలలనాడఁ దనకి • దేసందనుచున్ ॥143

పంచచామరము. హుటాహుటీనఁ దత్ప్లవంగ • యోష వాఁడిచూడ్కులన్
గటారులమ్మిటాఁడ్రిభూమి • కాశకార్ముకమ్ము సం
దటాలునం గదించి తేటి • నారిలాగి నాటెఁదా
జటాచిటాయటంచుఁ వారి • చిత్తముచ్చిపోవఁగన్॥ 144

క॥ వేగంటిజూఁపి దినకరు వేగంటిదినేశుఁ జూపి • వేసెనిషువులన్
వేగంటిదమ్ముఁ గుట్టుకు వేగందననేర్పుమీఱ • వెలఁదిమదిఁ గనన్॥145

చ॥ వలపులపాదుపాహిఁ గలఁ • పంగలగుందువహించిలావుఫ్రౌ
వలపులు వడ్డికిం బఱవ • వాసవు తేజము నిర్గమించి యా
వలపుల యిక్కయొక్కతల • పైరవి తేజము గ్రీవపైఁబడెన్
వలపులు దీరెనా వెనుక • వారికి వారిజపత్రలోచనా!॥ 146

## వాలిసుగ్రీవులజననము.

క॥ ఆగతిస్వర్గ్రహపతులున ధోగతిగా రేతమూని వి ♦ ధువదనకిడఁద
ద్యోగం బెట్టిదియోాస ద్యోగర్భంబునసుపుత్ర ♦ యుగముఝుం చెన్!

వ॥ ఇట్లుప్లవంగకళత్రంబువలనంగలిగిన పుత్రయుగంబునీక్షించి వాసవ
మిత్రులు గగనతలంబునుండి పంటవలంతికిండిగ్గి పుత్రత్రితయమైన
కళత్రంబుడగ్గరియందు నింద్రుండిట్లనియె. 148

చ॥ తెలివ! త్వదీయశీర్షగత ♦ తేజమువాలముఁ జేరఁగలై సుం
దరతనయుండువాలియను ♦ నామముగాంచునితండటంచు బం
గరువరహాలపేరొకఁటి ♦ గంఠమునందిడిముద్దులాడి విం
బెరువునఁ నేగెవాసవుఁడు ♦ దివ్యవిమానము నెక్కి వీటికిన్ ॥ 149

వ॥ అంతనర్యముండు 150

ఉ॥ ఏవిడు తేజమూర్తిఁధరి ♦ యించీనఁగలినవాఁడువీఁడు సు
గ్రీవుఁడునాఁగనొప్పెసఁగుఁ ♦ బ్రేయసి! పావనిత్రోఁసఖత్వ మిా
పావనుఁడూనుఁ దేజుగల ♦ నాఁడగుసుమ్మనిపల్కి సూర్యుఁడం
తోవడివార్ధిఁగ్రుంకెను సు ♦ తుండునితుండయియుంటనోయనన్ ॥ 151

## ఋక్షవిరజుండు మరలఁబురుషుండగుట.

ఉ। అద్దినమెల్లనప్పడఁతి ♦ యాత్మకుమారులతోడనుండి తాఁ
బ్రొద్దులతూర్పునంబొడువఁ ♦ బూర్వవధూత్వముఁబాసి యచ్చ్వసం
గ్రుద్దినలాగునవృక్షచర ♦ రూపముదాలిచి పౌరుషమ్ముమెూ
నద్దిరచిత్రమయ్యెనని ♦ యాత్మకథన్మదిలోఁదలంపుచుం
గ్రద్దనవ్రొప్పటుంగదలి ♦ కంజజుధామముఁ జేరెఁ బేరిమిన్ ॥ 152

వ॥ ఇట్లుతత్పురవీథిం జనుదెంచి బ్రహ్మసభాముఖంబుంబొడఁగని 153

మ॥ ప్రజఁగల్గించెడుతండ్రిఁ జేరఁజనిరా ♦ రాబాబు! రాతండ్రి! యీ
త్రిజగత్పావనివాణియవ్వయగు నీ ♦ దేవుండుతాతంచు నా
త్మజులంగూర్చివచించి దండములు బ్ర ♦ హ్మంగూర్చిపెట్టించి పం
కజగర్భాత్మజుఁడంజలిన్ సలిపి ప్ర ♦ క్కన్ బ్రీడతోనిల్వఁగాన్ ॥ 154

ఉత్సాహము. స్వాకృతిన్వహించికొల్చు♦నాత్మజద్వయంబుతో
వీఁకనిల్చియున్న ఋతు♦విరజుఁబుత్రుఁజూచి వే
దాకరుండు బ్రహ్మనవ్వి♦హర్షమొప్పఁ బుత్రులన్
శ్రీకరాంగివాణితాను♦ జేరబిల్చి పేరులన్ ॥ 155

తోటకము, తోడలందిడి వేడుక ♦ తోడనుము
ద్దడరంగడుగాఁ జెయి ♦ నంటుచుఁ బ్రే
ముడి జెక్కిలి నొక్కుచు ♦ ముద్దిడుచుం
దోడి వెన్నులదట్టుచు ♦ దుర్విరహా! 156

మత్తకోకిల. ఆశిముత్తెపు కెత్తులొక్కక ♦ డాకుమారులకిచ్చి య
ర్వాణిపుష్కరసంభవుండు న ♦ వారిదీవనలిచ్చి శ్రీ
జానకీపతిపాదభక్తిఁ బొ ♦ సంగునీతఁడటంచుఁ ద
ద్వానరార్భకులందు రెండవ ♦ వాని గూరిచి పల్కిరా ॥157

క॥ అనిపల్కి ఋతువిరజుని గని వేలుపుఁ బెద్దవలికెఁ ♦ గరుణాన్వితుఁడై
తనయా! తెలిగంటితనంబునఁ గన్న కొమాళ్లతోడఁ ♦ బోయి వసుధకున్

క॥ వనచరకులపతి వయిమనుమనఋతువిరజుఁడు వల్కె ♦ నబ్జభవునకున్
జనకా! సరసింబడిపోఁల, తినయితి వేగఁబురుషగతిఁ ♦ దిరిగితి నేలా! 159

వ॥ బ్రహ్మ ఋతువిరజుండు గాంతయగుటకుఁ గారణంబతని కెఱింగించుట

చ॥ అనఁగ హిరణ్యగర్భుఁడపు ♦ డాత్మజుగన్గొని పల్కు, వత్స! యా
వనమున నాసరస్సున, న ♦ వారితవారివిహారలోల, హై
మనగధనుష్కదేవి నిజ ♦ మానవతీతతితోడఁ డిగ్గి, జీ
వనముల జల్లులాడఁగని ♦ వారల మోసముసేయ నయ్యెడన్ ॥161

మ॥ దితిసంతానముగామరూపములతో ♦ స్త్రీరూపముల్ దాల్చి త
త్సతిసంతానములోనఁ జేరి, తమి హె ♦ చ్చఁ గ్రీడసల్పంగ, నా
పతిసర్వంబు నెఱింగి, యీసరసిని ♦ చ్చం జొచ్చువాఁ డెవ్వఁడేన్
సతిరూపంబువహించునంచుఁ బలికెం ♦ జాలంగఁ గోపమ్మునన్ ॥ 132

ఉ॥ ఆవిధియంతయుం దెలిసి ♦ యాత్మజ! యాదట మేనకాత్మజన్
సవిధిపూర్వకమ్ముగన ♦ నింద్యమతిం భజియించి వేడ నా

దేవికృపామతిఁ సరసి • దిగ్గినవానికి నానురూపమెం
తే వెలయంగ నొక్కదిన • మేతగు నాపయినుండదంచనన్॥ 163

ఉ॥ కానదినావసానమునఁ • గల్కి తనమ్ముదొలంగినాఁడవ్రా
సూనుఁడ! లజ్జయేల యిది • చోద్యమె శ్రీహరికొక్క యెట్టులో
జానలరారనట్టవుట • సాజము కావున నీవు వేగమే
యీనవకోమలాంగుల ర • హింగొనిపోయి మహీతలమ్మునన్॥ 164

శా॥ చెన్నారందొగరాచభాగములతోఁ • జేజేలపొన్నారి ము
న్నన్నా! రంజిలఁజేసెఁ బ్రోలొకడు నా • హా! దానిచెన్నంతయుం
గన్నారంగనఁగల్గు వానికనులే • కన్నుల్ కనున్వేడ్కఁ బొ
మ్మన్నారంతులకేల యేలికొనుము • న్నా! నీవునీవారితోడన్॥ 166

క॥ అనఋక్షవిరజుఁడిట్లను వనజజునకుజనక! నీదు • వచనముపేర్మిం
బొనరింతుఁదత్పురంబేమనిబ్రబలినదొ తెల్పు•మానామముతోన్

బ్రహ్మకిష్కింధకేగఁ ఋక్షవిరజునకాజ్ఞాపించుట

వ॥ అనినసకుమారుండైన కుమారునకు హరికుమారుండిట్లనియె. 167

ఆ వె॥ క్షితిబ్రవర్ణనాద్రి • చెలువొందునాగిరి
రాజదండధర్మ • రత్నఖచిత
గోపురములఁజెన్ను • గుల్కెడుఁగిష్కింధ
నాఁగవీడు నచటి • కేగుఁడీవు॥ 169

క॥ పుష్కరభవుఁడీపగిదిఁబ రిష్కారముసేయభక్తి • ఋక్షవిరజుఁడా
పుష్కరభవువీడ్కొని శ్రీ కిష్కింధానగరమునకొ • గింబ్రీతిఁజనన్॥

వ॥ ఇట్లు ఋక్షవిరజుండు జనకునివీడ్కొని కుమారులతోడం దక్షిణాభి
ముఖుండై సత్యలోకంబునుండి పంటవలంతికిం దిగునప్పు మధ్యే
మార్గంబున. 170

ఋక్షవిరజుండు బ్రహ్మాజ్ఞఁగిష్కింధకేగుట.

క॥ అలనిక్కఁ(వు)జగము మొదల నెలమినిభూజగముదాక • నెన్నిజగమ్ముల్
గలవన్నిజగములగడచి యిలకున్వచ్చెసిమతియు• నెంతేఁద్వరతోన్

ఆ. వె॥ మిన్ను వాఁకఁ గలసి ♦ మెలఁగెడు తరగల
మెఱసి సకలనదులఁ ♦ దరఁగఁ గేళ్ల
జంటఁ గౌఁగిలిఁగొను ♦ పంటముత్తెదువ
గంటల మొలనూలు ♦ గాంచి మించి 171

చ॥ నగములనా నగమ్ములఁగ నందగు కందరమందిరమ్ములన్
మృగములనామృగమ్ములు య ♦ థేచ్ఛ జరించు మహావనమ్ములన్
ఖగములనా ఖగమ్ములుద ♦ గంజరియించు నగావళిన్మహో
రగములనా మహోరగవ ♦ రమ్ములయిమ్ములఁ గాంచు చాదటన్॥ 172

క॥ పొడఁగని మోఁబదునొకండా మడలవలయమంత యెత్తు ♦ మట్టుగలదై
యడరు ప్రవర్షణధరముం బెడగడరెడు గండశిలల ♦ మెండగు దానిన్ ॥

ప్రవర్షణాచలరాజవర్ణనము.

సీ॥ మఱియు నెయ్యది వేల్పు ♦ మన్నీడు జడివాన
నడరింపఁ బ్రవర్ష ♦ ణాఖ్య దాల్చె
నెయ్యది శ్రీరామ ♦ కృష్ణులకలనాఁడు
నమరంగ శరణాల ♦ యంబునయ్యె
నెందు జరాసంధుఁ ♦ డింతచిచ్చిడి రామ
కృష్ణుల కెంతయో ♦ కీడునల్పె
నెందు గండశిలాళి ♦ నిభపాళి యనుశంక
గంఠమైసింగముల్ ♦ చెండనుఱికి

తే॥ పొందు భంగంబుఁ దమగోళ్లు ♦ మొక్కవోవ
భిల్లపల్లవాధరలెందు ♦ వీణపాట
బాడఁ బడగలవిప్పి స ♦ ర్పంబులాడు
నా ప్రవర్షణగిరి నెన్న ♦ నలవియగునె॥ 174

వ॥ అట్టి ప్రవర్షణాచలరాజంబు దరియం జొచ్చి దాసిలచ్చికచ్చెరువందుచు నచ్చోట్ల ద్రిమ్మరి రేఱేఁడచ్చోటుంగదలివచ్చి యచ్చెరువ. 175

కిష్కింధాపురవర్ణనము.

మ॥ తిలకించెన్ మణివప్రచుంబితమహా • దేవేంద్రధామమ్ము సు
జ్వలఖేయస్థసుగంధిసీర విచర • వ్యాళాంగనానర్మ వా
క్యలసద్వక్త్రశశాంకమండలము ది • వ్యస్త్రైభవాడంబరా
ఖిలవిద్యోత్కవివర్ణనీయమగు కి • ష్కింధాపురీరాజముల్ ॥ 176

క॥ ప్రాకారచిత్రితమృగేం ద్రాకారములందిలకించి•యడలుసనెంతేఁ
శాకారిమదపు లేనుఁగు వేకాటియ వెట్టునంచు•భీతిఁబొలంగల్ ॥ 177

శా॥ ఏరాతాలఁబసిండి మేడగమిఁ బే•ర్మిం గ్రీడలం జల్పు చే
జేరాజెల్వలపిండునొండొరులతో • జల్వారఁగానందు కి
ఏరాతాలపసిండి మేడగమిని•క్రీడావనీపాళి యం
దేరాజన్యవధూతతుల్ దిరుగునో•యిష్టాప్తిమైజెల్లరే!॥ 178

చ॥ వలపులకాటపట్లునళి • వారముపాలిఁటి వేల్పుజెట్లు నా
వలపుల రాజు వ్రేట్లువను • వారలు ద్రిమ్మరు మేలిచోట్లు మేల్
వలపుల రాజుదంష్ట్రకళి • లంబతియించెడుపిసుపట్లు బల్
వలపుల తేనిసంగరపుఁ • బట్లుపురంబునఁబోటలెంతయున్ ॥ 179

శా॥ నేరేళ్లుంగజనిమ్మలుం గ్రముకముల్ • నిమ్మల్ వటాశ్వత్థముల్
మారేళ్లుంగరవీరపాటలములున్ •మాదీఫలమ్ముల్ లస
న్నారంగమ్ములనాసలుంబనసలుం • ద్రాక్షోకళవృక్షమ్ములం
బారంబుల్ సకలర్తుధర్మములఁదోఁ • పంగ్రాలునందున్వనుల్॥ 180

మ॥ దరచక్రాంబుజమత్స్యకచ్ఛపసము • ద్యత్సౌరరేఖావళీ
వరభవ్యోర్మికకంకణాన్వితములో • పద్మాకరమ్ముల్ వలెం
దరచక్రాంబుజమత్స్యకచ్ఛపసము • ద్యత్సౌరరేఖావళీ
వరభవ్యోర్మికకంకణాన్వితలై • పద్మాకరమ్ముల్ తగున్ ॥ 181

సీ॥ కోటలా తెలుగంటి • కోటలాగలుగంటి
సూటిఁగన్గొననిక్కు • పాటిదోఁచుఁ
బేటలా తెలుగంటి • పేటలాగలుగంటి
ఘాటినన్నట్టునం • దముగఁదోఁచుఁ

తోటలా తెలుఁగంటి • పాటలాధరలంటి
ధాత్రిజద్దగినచం • దానఁదోచుఁ
దోటలా తెలుఁగంటి • దోటలాగలుగెంటి
పాటిమీఱినభంగి • బరగఁదోచుఁ
తే॥ మేడలా తెలుఁగంటిరా • మేడనాగు
వాడలా తెలుఁగంటిరా • వాడలాగు
గోడలా తెలుఁగంటిరా • తోడసాగు
జాడలా తెలుఁగంటి ప్రోల్ • జాడలీగు॥ 182

మత్తకోకిల. కోటలన్నియుఁ మేలిబంగరు • కొమ్ముఁపుంబురుజుంగమిం
చోటలన్నియుఁజంద్రకాంతపుఁ • మేల్మిబంగరు మేడలం
బాటలన్నియుఁజందనాగరు • వాసనావళి మేలిబూ
దోటలన్నియుఁబూలమొగ్గలఁ • దోరగాయల నొప్పెఁజుమ్ ॥

సుగంధి. మేడలన్నియుం బసిండి • మించుటద్దఁపుంగమిం
గోడలన్నియుం బెడంగు • గుల్కు వెన్నచూపులన్
వాడలన్నియుందగున్ సు • వాసితోరణమ్ములం
జాడలన్నియుందలంపఁ • స్వర్గమీపురంబహా। 184

ఉ॥ గీర్వరనందనుండిటులు • ఖేచరదామసమానమైన యు
ప్పూర్వరమహ్యరాజితద • పూర్వఁపుసృష్టివిచిత్రకౌశలం
బుర్వరనొందఁగానమను • చుల్లమునందగఁ జనుబ్బఁగాంచుచా
యుర్వరుముద్దుబిడ్డలకు • నింపుగఁదెల్పుచుఁజొచ్చెఁదద్వనిన్॥ 185

జాంబవదాది వానరవీరులు దైవవశంబున బుక్షవిభుజు జేరుట.

క॥ ఈలాగున నాచ్ఛస్వకులజు లేలాగునఁగానుపింతు • రెటుజొత్తుఁబురిం
జాలఁగఁగనిబుక్షవిభుజు డాలోచన సేయుచుండ • నచ్యుతుకరుణన్ ॥ 186

సీ॥ ప్రాచిమూడియహీన • బలసంపదలతోడఁ
జాంబవన్నలనీలు • శతబలులు న
వాచిమూడియఖండ • బాహుబలశక్తులతోడఁ
మైందద్వివిదగంధ • మాదనులు ప్ర

తీచినుండియ శేష•ధీసంపదలతోడఁ
దారహారిసుషేణ•దక్షిముఖులు ను
దీచినుండియభంగ•దివ్యప్రభలతోడఁ
గజగవయగవాక్షు•కపివరేణ్యు
తే॥ లాత్మబలములతోడఁ దా•మరుగుదెంచి
ఋక్షవిరజునిఁగనియందు•వృక్షచరవ
రేణ్యులందఱలోన గ్ర•గణ్యుడైన
జాంబవంతుఁడు ప్రాంజలి•సల్పిపలికె: 187

ఉ॥ దేవ, మహానుభావ! తమ•దివ్యతరాహ్వయమెద్దియో భవ
త్సేవమహాప్రసాదమని•చేసెదునీపసిపాపలెవ్వరో
తావకధామమేయెడనొ•తామిటఁరాగతమేమొ యేమహా
పావకధాముడైననిటు•వచ్చఁగవచ్చితిరేమొపల్కవే॥ 188

క॥ నరసఁస్ఫుటాచారమ్ముం బ్రబరుచిరసంపదయుఁబ్రహ్మ•నర్చస్సున్ శ్రీ
పరమేష్ఠికులజులనిమొగ మరసినఁజెప్పకయచెప్పనారార! భళీ॥ 189

చ॥ అనవుడుజాంబవంతునకు • నాతఁడువల్కెఁగపీంద్ర! భారతీ
శునకుఁసుతుండ ఋక్షవిర • జుండనువాడ విరించియాజ్ఞముల్
ననములసంచరించుచుఁ బి • పాసనుజక్కి సరోరుహాకరం
బునకటువ్రాయిఁద్రోలి జల • ముల్ దగఁబాపిసరోవరంబునన్ 190

ఉ॥ నీడనుఁగాంచి శత్రువని • నీటనుదూకి యడేరిఁగాన కం
దోడనగట్టుఁజేరి యొక • తొయ్యలినై హరిమిత్రులీయఁ దో
డ్తోడన యీకోమాళ్లఁగని • తొయ్యలిరూపమునూడ్చి కంజభూ
త్తోడనుఁదెల్ప నీసుతుల • తో నిటువొమ్మన నబ్జజాజ్ఞచేన్॥ 191

క॥ ఏలికొననరుగుదెంచితి వాలినిసుగ్రీవుఁగూడి•వడిఁగిష్కింధన్
మేలిటవచ్చితిరీరలు బాళింగ్రుంకఁజన నెమర•వచ్చునద్రిక్రియన్॥ 192

వ॥ అనిన జాంబవంతుండు 193

చ॥ జయముజయమ్ము ఋక్షవిర •జా! విధిజా! కపిరాజరాజ! నీ
జయముజయమ్ముమాకుఁవిధి • శాసనమీరలశాసనమ్ములన్

భయమునభక్తిమైఁదలల • పైఁధరియించి సతమ్మమేము నీ
జయమునుఁగోరి నెమ్మదులఁ • జల్పుదుమూనతియిమ్ము కార్యముల్॥

క॥ అనవిని శుభదివసంబునఁ జనఁగాఁ వలెమనము రాజ • సద్మంబునకా
దినము వెదకితగువారలఁ బనుపుఁడు సమకూర్పనెల్ల • వస్తువ్రజముల్॥

సితగజాదులకొఱకు జాంబవంతుఁడు స్వర్గపురమున కేగుట.

మ॥ అనగా నంతట జాంబవంతుఁడు మహా • హర్షాత్ముఁడై నీలుఁజ
య్యనఁ గిష్కింధకుఁ బంపి ప్రోలిఁగయిసే • యందాను వేస్వర్గప
త్తనరాజమ్మున కేగి గీష్పతికిఁ మో • దంబారఁగాఁ మ్రొక్కి సం
తసనగా గార్యము విన్నవింపఁ సుముహూ • ర్తంబెల్లి కిష్కింధకు
జనఁ రాజున్నిలుపంగఁ గూడుననఁగం • దాఁ జాంబవంతుండటన్॥ 196

చ॥ నడివడియింద్రుఁ జేరి రహి • వందనముం బొనరించి దేవ! తాఁ
దొడితొడి జెప్పఁ గూర్మి దమ • కోడను బల్కు మటంచుఁ వానరేం
ద్రుఁడు వెఱగంటి గాణగమి • రోవిరిబోఁడులఁ వాయిదమ్ములం
గడువడి బంపుమంచుఁ గృపఁ • గన్గొని పంపుడు వేగ నావుడున్॥ 197

శా॥ ఔరా! వానరరాజు ఋక్షవిరజుం • డా! పాకుఁ జుట్టంబ కా
దా! రారమ్మని కూరుచుండమని త • త్తక్షేమలాభమ్ములం
గారాబమ్మునఁ దగ్గి నేనని పెదం • గా దాయటంచన్నఁదో
స్తోరానేగెను దెల్లగారు వెలబో • టుల్ గాణలుం జాణలున్॥ 198

ఋక్షవిరజాదులు కిష్కింధలోఁ బ్రవేశించుట.

మ॥ అటు గిష్కింధకునేగి యామరుదినంబం • దందఱుం గూడి యం
తటఁ గ్రైసేసి సపుత్రు ఋక్షవిరజు • న్గంధేభరాజమ్ముపై
నటు గూర్చుండగఁ బెట్టిదండ వెలబోం • ట్లాడంగఁ వాద్యమ్ములం
తటఁ మ్రోయ బుంటభేదనంబుఁ జొఱె రం • దం బొప్పఁ వారందఱున్॥

వ॥ ఇట్లంతకుఁ మున్న చెన్నుమీఱఁగ్రైసేయఁబడి "నిత్యకళ్యాణమ్ముం బచ్చతోరణమ్ము" నై వెలుంగు శ్రీమత్కిష్కింధానగరమ్ముఁ జొచ్చి ప్రోలిసోయగంబునకచ్చెరువందుచుఁ బురవీధినూరేగి వియచ్చరరాజు రచ్చలచ్చినవలబుచ్చు రచ్చసట్టుం జేరి ఋక్షవిరజుండు దాను

కందగీతగర్భితచంపకము.

వరకవనప్రియా! మహిత• వైభవ! సన్మృదుమంజువాక్య! బం
ధురహృదయా! మహావినయ•ధుర్య! దయామయ! వీరవర్య! శ్రీ
కర! భవకింకరా! సుకవి•కంజవనార్యమ! సూరివర్య! సా
దర! సునయాకరా! ప్రకట•ధామ! పకీరయభవ్యనామకా! ॥ 208

గర్భకందము.

కవనప్రియా! మహిత వైభవ! సన్మృదుమంజువాక్య•బంధురహృదయా!
భవకింకరా! సుకవి కం జవనార్యమ! సూరివర్య!•సాదర! సునయా! 209॥

గర్భతేటగీతి.

మహితవైభవ! సన్మృదు • మంజువాక్య!
వినయధుర్య! దయామయ! • వీరవర్య!
సుకవికంజవంజవనార్యమ! • సూరివర్య!
ప్రకటధామ! పకీరయ • భవ్యనామ! 210

మాలినీవృత్తము. పరిమకులపవిత్రా! • పండితాంభోజమిత్రా!
నరకవిజనమిత్రా! వైరిసందోహజైత్రా.
గురుతరసుచరిత్రా! • కోటయాఖ్యాత్మపుత్రా!
స్ఫురగురుఘనగాత్రా! • ముత్యమాంబాకళత్రా! ॥

గద్య.

ఇది శ్రీమ"దచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య నృగచరిత్ర" కృతివిరచనాచాతు
రీధురంధర సద్యశోబంధుర కౌండిన్యగోత్ర కలితాపస్తంబసూత్ర
చతుర్విధకవితామతల్లి కాజ్జరాజాన్వయపయఃపారావార రాకా
కైరవమిత్ర నృసింహామాత్యపౌత్ర మంగాంబా శేషా
చలామాత్యపుత్ర సుధీజనవిధేయ హనుమంత
రాయనామధేయ ప్రణీతంబైన "శ్రీమత్సు
గ్రీవపట్టాభిషేకంబను మహాకావ్యంబు
నందు ప్రథమాశ్వాసము.



శ్రీ రస్తు.

శ్రీ సీతారామాయనమః.

# శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము.

హనుమత్కావ్యము.

(ద్వితీయాశ్వాసము.)

కం॥ శ్రీమత్కిష్కింధాపుర ధామ! కవిస్తోత్రనామ! ధరణీతనయా
కామపదాంబుజసేవా కామ! పకీరయసనామ! ఖరకరధామా! ॥ 1

కం॥ అటమీఁది తెఱఁగువినుఁడు
త్కటకరుణాంజంద్రధరుఁడు కాళికిఁతెభ్ర
త్కటకమున నుడువున డువున
నటసూతుఁడు సెప్పెఁ మునుల కాప్పైనికతఁ ॥ 2

సముద్రమథనాదికథాసంగ్రహము.

చ॥ క్రమముగఁ బాసవాల్ దొరలు రక్కసులుఁ సుధఁ గోరిపాల సం
ద్రమ నెముకుండమందరధ రమ్మనుకవ్వము బెట్టి మేటిలా
గమనికి తేని త్రాడుఁగడు గట్టిగఁ జుట్టి కరమ్ముఁ బట్టి ధై
ర్యమడరఁగా మథింప మహి తార్చటిఁ బుట్టె విషమ్ము తొల్త నే॥ 3

చ॥ కలిగిజగమ్ములంగలఁచ గాసళికాత్ముఁడు మ్రింగె నంతనాల్
గలిగినసంయముల్ గొనిరి గంధగజేంద్రము వెల్లగుఱ్ఱముం,
గలిగిననింద్రదుఁడుం బలియుఁ గై కొనిరిందిరయున్మృగాఙ్కుఁడుం .
గలిగిర మేశువఱమల ఖస్థలముంగయి సేసి రంతటఁ 4

కం॥ కొమ్మలొ మేలిమిచివురుం
గొమ్మలొ మరుకత్తిలాని కొమ్మలొ జిగిగీల్

బొమ్మలోఁ బైడిమెఱుంగుం
బొమ్మలా నావేల్పుటాంద్రు • పుట్టిరిజలధిన్॥ 5

తారవర్ణనము.

క॥ అవ్వామాక్షులలోనం బువ్వారుంబోఁడి తార • వొల్చును వలరా
క్రొవ్వారుమదపుటేన్గన మవ్వంపుంబువ్వుబోండ్ల • మానికమనఁగన్॥

ఉత్సాహము. పల్లవోష్ఠిజవ్వనంపుఁ • బాలవెల్లిలోని తా
బేళ్లు గోడెమీలు సుళ్లు • బెంగరుళ్లు నుర్వి మీ
గాళ్లు కనులు లోతుబొడ్డు • గల్కి ముత్తరుల్ నవుల్
త్రుళ్లుగాఁగ దంద్రిఁబోలు • తోయజాక్షి నాఁదగన్ 7

సీ॥ కల్వలోఁ బెనుమీను • చెల్వలోఁ దుమ్మెద
చెల్వలోఁ గటిపుల్గు • చెల్వలోక్కా
తేటులోఁ గటిమబ్బుఁ • దాటులోనీలంపుఁ
గూటులోఁ గటినాచుఁ • దాటులోక్కా
పండులోనున్నపైడి • గిండులోజక్కవ
గండులోఁ బొందమ్మి • చెండులోక్కా
మించులోహొందీవ • సంచులోపవడంపు
సంచులోరిక్కల • మించులోక్కా
తే॥ నాగఁదనరారునామెల • నాగకనుల
తీరు గొనబారుపెన్నెరుల్ • తారుచనుల
సారు బెడగారుమెయిడాలు • తీరు కనులఁ
దీరుగాఁగాంచునిలలోన • వారికబల!॥ 8

చ॥ తెలవపిఱుందు నెన్నొసలు • దిన్నెలతోఁ నెలతో నెదిర్చెడుం
బరువఁపుగుబ్బలుంగిరము • మందరముందరముల్ హసించెడున్
సిరిగలమేరు నెన్నడలు • శ్రీకరినింగరినిన్ గలంచెడున్
హరువుగఁగెల్చుఁగొను రద • మంబరముంబరమాపుమల్లికన్॥ 9

క॥ వేల్లాకన్నుంగవతా బేల్లామీఁగాళ్లు గోళ్లు • పెంపులురిక్కల్
చాళ్లాచొక్కఁపుమావిచి వుల్లాపదయుగముపువ్వు • బోఁడికినహా హా!

సీ॥ తెలుపమేల్ తలకట్టు•దీర్ఘమ్ములై యొప్పు
గుడిరీతి శ్రవణశ•ష్కులికలొప్పఁ
గొమ్ములలాగు కం•దమ్ములుఁ గననొప్పు
వానిదీర్ఘముచూడ్కి•వరుసనొప్పు
నేత్వమైత్వము పాటి• నెసఁగుహ స్తయుగమ్ము
నొత్వమ్ముగతిబొమ•లొప్పియుండఁ
బుత్వమ్ముతో నాసి• కెత్తువచ్చుఱసున్న
తో నెన్నొసల్ తుల• తూఁగుచుండఁ
తే॥ నాభికూపమ్ము నెఱసున్న• నాఁగ నొప్పు
ఘనకుచములనుస్వార యు•గమ్ము నెప్పు
డెన్ను నంచనఁ జెలియొడ• లెల్లగుణిత
పద్ధతినిఁ దగనని చేతు•పలుక నేల॥ 11

ఆ. వె॥ "ళా"సుమధ్యముమహి• ళాసుమధ్యమునప్పఁ
"దా"పిఱుందునగుఁగ• దా పిఱుందు
"ళా"ప్రకారమవుబ• ళా! ప్రకారము నెన్నఁ
"దాని"యెదనుతించు• దానియెదను॥ 12

తే. గీ॥- నెఱులు నే రేడుఁబండులు•నిమ్మపండ్లు
దోరఁపుంగబ్బిగుబ్బలు•దొండపండ్లు
గెంపువా తెఱదాకపం•డ్లింపుగుల్కు
పల్కు మఱిపండ్లుమడమలు•పడతికహహ!॥ 13

చ॥ లలితవిలాససంపదలఁ•లక్ష్మికిఁ జెల్లెలు పోయగంబుసం
గలితవిలాసలైన సుర•కాంతలకున్ సహజాత సద్గుణో
జ్జ్వలితవిలాసలం గలశ•వార్ధికిఁ బుత్రితరంబ యెన్న నా
కలితవిలాసకాక సరి• కాకమఱొక్కతె కల్గునే కనన్॥ 14

క॥ ఈదృశవిలాసతత్సతి తాదృశశరథిజనియించి•తనతండ్రియెదన్
సాదృశ్యరహితమైనమ్మ గీదృశగంటినను పెంపొ•గింగలిగించెన్॥15

తారనుమోహించి వాలి సుషేణులామెకేల్గోయిఁబట్టుట.

క॥ ఈకరణిఁగలిగిదివిజని
శాకరనిభవదనలందు•జాలనెఱినిర
త్నాకరమువెడలివచ్చెగు
ణాకరుఁడగుపురుషుఁడనకు•నరయుటకోనాఁ॥ 16

ఉ॥ అంతకుమున్ననచ్చటికి•నైంద్రసుషేణులువచ్చియుంటఁద
త్కాంతనుగాంచిదానిమెఱ•కంపుటొయారముదానిచొక్కపుం
గాంతియుదానిసోయగఁపు•గల్మియుఁదానిజగోనడల్ హొయల్
భ్రాంతినిముంచుదానినెఱి•వాల్ నునుజూడ్కులతీరునెంచుచున్॥ 17

చ॥ పనివినిచెంతకయ్యెడన•భంగనఖద్యుతినింద్యదారఁమో
హినియపరావతారమణి•హేమసమన్వితతారహారఁస
త్యనిచయవాక్ప్రిచారఁతత•త్రైర్థికతాపవిదారఁసజ్జన
ప్రనిచయకీర్తనీయగుణ•వారనుదారనుదారుగాంచుచున్॥ 18

ఉత్సాహము ఎదురుగానుబోయివార•లిరువురుఃజెనవ్వులం
గదురుమోముమలందదీయ•కాంతకేలుదామరల్
గుదురుగాఁస్వహస్తములను•గోర్కిమీరఁబట్టిరా
యదురుబెదురులేకతమక•మంతకంతకెచ్చఁగాఁ॥ 19

ఉ॥ దాపలికేలఁవాలితన•దక్షిణహస్తమునన్ స్వకీయవా
దాపలికేలునోలిఁదన•దక్షిణపాణిసుషేణునిన్ వలం
దాపలిక్రేవనెంతయుము•దంబుననిట్టులుపట్టినిల్వగాఁ
దాపలిక్రేవకైతిరిగి•తారసుషేణునితోడనిట్లనున్॥ 20

తారసుషేణునితోఁ వాలితోఁబ్రసంగించుట.

మ॥ చెలిఁగాంధర్వమునం గొనందలచితే•స్త్రీదక్షిణంపుంగరం
బలరం బూరుషుఁడైనవాఁడు పెడకై•నంటన్వలెం దానికి
న్వలిగాఁదా పెడకైనిబట్టితివి తం•డ్రీ! నీకికేనాలిఁగా
నెలమిం బెంపుమపట్టినాడునను నెం•తేబెంపుమాకూర్మిమైన్॥ 21

మ॥ అనివాలింగని పూరుషాగ్రణిమహాహ్లాదంబుతో నేలు న
న్ననివార్యంబగుప్రేమ నీకడలి నీకై కల్గఁగాఁ జేసెనన్
వనజాక్షుండతఁ డేమిగాఁ దలఁచెనో స్వాంతంబునం దట్టిలో
వనజాతాసనపౌత్ర! ఋక్షవిరజాపత్యంబ! నిన్నోరి జ
వ్వనముం జన్నియవట్టియుంటిఁ ఫలియింపంగంటి నాకోరికల్॥ 22

చ॥ జిలిబిలి తేనియల్ నుడులఁ జిల్కుచుఁ గుల్కుచుఁ బల్కు నాజగా
కులుకులవాంతి వాలిగని కోమలి నేలఁగఁ గంటి నంచు నీ
వలపుల యిక్కఁ జిక్కని ప్లవంగశిఖామణి వాలి కిచ్చి నా
కులము పవిత్రతం జలిపి కొంటివటంచు సుషేణుఁ డందగన్॥ 23

## తారావరారోహ వివాహము.

శా॥ చాలం జంకలు గొట్టుకొంచు నగుచుం జంద్రాస్యతారం జగా
బాళిం గైకొని ప్రోలికేగి వెనుకం బ్రాజ్ఞుల్ ముహూర్తం బొకం
డాలోచించి వచింప దారకు మహాహ్లాదమ్ముతో వాలికిం
దె త్రైలోక్యంబును మారుమ్రోతలిడ వాద్యవ్రాతముల్ మ్రోతకున్

ఉ॥ శ్రీసురుచిప్రహాసుఁడు సుషేణుఁడు శేషవిశేషశేముషీ
భాసురుఁడాగమోక్తవిధి బాంధురబంధుజనాభిరమ్యమై
భాసురవజ్రపాణిభవంబు హసింపఁగఁ జాలు వైభవం
బై సురవంద్యమై తనర నాయెడఁ జల్పె వివాహ మెంతయున్॥ 25

## సుషేణుఁడు తారనత్తింటికనుచుట.

ఉ॥ చిత్తము వొంగ నీకిరణిఁ జేసి వివాహముఁ గూతునట్ల మేల్
హత్తులఁ గత్తలానుల ననందపురోవిరిబోండ్లు లోనుగా
నత్తకు నిచ్చి పుచ్చెఁ రహి నందనునందగుఁ డందముందుగాఁ
గత్తులు దూసి సద్భటని కాయములోరల బాఱుదీరఁగాన్॥ 26

క॥ తారామనోహరుఁడుగాం
తారత్నముఁ గూడి గృహమునకునరిగినటుల్
తారామనోహరుఁడు గాం
తారత్నముఁ గూడి గృహమునకుఁ బుడరిగెన్॥ 27

వ॥ ఇట్లు గృహంబుఁ జేరి 28

వాలి తారతోఁ గూడి విహరించుట.

ఉ॥ చందురుఱాల మేడలఁ బ•సందగు కుందవనంపువాడలం
గందపుఁ జెట్లనీడల జ•గాజిగ తమ్మికొలంకుజాడలం
గందుదురంపుఁదోటలఁ జొ•కాటపుఁ బాటల వింతమాటలం
జందనగంధి తార కపి•చంద్రుఁడు వాలి సెలంగి రెంతయున్॥ 29

తార నీరు మోయుట.

ఉ॥ ఆకరభోరువీకరణి•నైంద్రిని గూడి మెలంగి వేకటిం
జోకరహింగనెన్ మగఁడు•జుట్టలు దల్లియుఁ దండ్రి హాళినిం
ప్రాకటరీతిఁ గాంచఁగ స్వ•వంశజులెల్ల సుజాల నెంచగాఁ
వేకటకల్కి యుంచఁగడు•వేడుక సేయఁగఁ దోడి చేడియల్॥ 30

ఉ॥ చెక్కులు తెల్పులాయెఁ నెఱ•జేఁగడియాలు వద్ధుల్లనాయెఁ జ
న్నెక్కులు నల్పులాయె మొగ•మంగడు వెల్వెలబోయె మంటిపై
నెక్కుడుగాఁగఁ బోయెఁ దమి•యేమిరుచింపక పోయె భోజ్యముల్
ద్రొక్కుడు సెందుటాయె నడ•తోయరుహాననకా యెడందగన్॥ 31

తే॥ కొమకు జుట్టుములుట్టిన • రమణిఁ గాంచి
తియ్యనైయుమ్మి విషమైన • దేమిత్రింగ
నన్నుఁ బుక్కిటఁ బెల్లంబు•నంగిటఁ విష
ముంచిపల్కున్న లిట్లని•యువిదనవ్వె॥ 32

క॥ ఆనళినయనని రుపేదైనకవును బలియుఁద్రివళు•లాగెంగను బీ
దైనయతడడరిదొంట్మా దైనఁబోరుపువారుమనెద•రాధరలోనన్॥ 33

ఉ॥ కమ్మనిమోవినాన నెస•కమ్మున రాయిగ నడ్డపెట్టు రా
రమ్మని కౌఁగిలించఁగభ•రమ్మని మెల్లగఁ గౌఁగిలించు లే
లెమ్మని కాముకేళికవు•లెమ్మని యెట్టులొ మాన్పి వేయుఁ గో
కొమ్మని కమ్మవీడియముఁ • గొమ్మని తాంతపుటూర్పుమైనిషన్॥ 34

క॥ లలనామణికీపగిదిని నెలలన్నియుఁ వరుసఁ నిండి • నీళ్లాడెడునా
నెలలరుగు దెం చెవిందుల కలనాదము మించె కొడుకు•గలుగునటంచున్॥

## కుమారోదయము.

శా॥ ఈశీలంగ్రహపంచకంబురవితో • నేకంబుకానట్టిదా
మేశౌలగ్నమునందుఁగాంచెఁగలహాం • సీయాన రామామనో
జ్ఞాలంకారు రమ్యాకుమారసుమనో • జ్ఞాకారదూరుం గపీం
ద్రాలంకారుఁగుమారుఁదిఙ్నిచయసం • వ్యాప్తప్రభావారునిన్॥ 36

వ॥ మఱియు నాకుమారుతిలకంబు జననంబునొందుసమయంబున. 37

క॥ ఆడిరిరంభాదులు రహిఁ
బాడిరిగంధర్వపతులు • బలియుండగునం
చాడిరి పెద్దలు వేల్పులు
కూడిరికురియుచుఁసురాగ • కుసుమఁపుముసురుల్॥ 38

మ॥ తనయుంసుద్భవమైనవాఁడని ప్రమో • దంబారనాలించి ఖ్యా
తనయుండైంద్రి వినిర్మలాంబువులనే • తానమ్ముఁగావించి యా
తనయుంగాంచి సువర్ణరత్నచయముల్ • దానమ్ములిప్పించెఁ రాట్
తనయుల్ మెచ్చఁగనిచ్చు భూసురలకుం • దాతృత్వమేపారఁగాన్ ॥39

తే॥ నిండువేడుకనిటువిందు • లుండరెండు
తలలు కుదురుగనేర్పడి తనరఁగఁబది
దినములేతొందరయుఁ లేక • చనిన వెనుక
పురిటినీళ్లనుబోసిరి • పొలఁతులెల్ల॥ 40

## తారాకుమారునకు నామకరణమ్ముసేయుట.

క॥ చట్టనంతటఁబెద్దలు పెట్టినమూర్తమునవాలి • బిడ్డకుసిరికిం
బట్టనఁగఁజాలునొకనెల కట్టునరహిఁబారసాల • గావించిరహా!॥ 41

క॥ రంగదుడురాజమణిలస తాంగదుఁడుమహోగ్రతరర • ణావనిక్రూ
జాంగదుఁడుపీఁడటంచప్ర డంగదుడఁనిపేరుబెట్టి • రాశిశువునకున్॥ 42

క॥ జోజోతారానందన! జోజోతారావరాభ • సురచిరవదనా!
జోజోతపనీయాంగద! జోజోయంగదయటంచు • జోలలువేడ్కన్ 43

క॥ బంగారుతొట్లలోపల రంగారుగుమారునుంచి • రాజనిభాస్యల్
సింగారఁపుఁబవడఁపుఁజే ర్లుంగారమెలర్పనూచి • రహిఁబాడిరహ ॥ 44

వ॥ ఇవ్విధమ్మున నక్కుమారరత్నమ్ము బాలకాలానిధివిధమ్మున దిన
దినప్రవర్ధమానుండై వెలుఁగుచుండె. దదనంతరంబ 45

వసంతర్తు వర్ణనము.

ఉ॥ మావులపంట పూవిలుతు • మావులునోచిననోముపంట నె
త్తావులఁజిల్కుకుంట పలు • తావులుసిక్కెడుజాజితంట క్రొం
బూవులవింటిదంట నెర • పూనికకుందగినట్టిజంట బల్
కేవులఁగుల్కుతేంట్లదగ • డించెడునామనిదంటవచ్చెనా॥ 46

సీ॥ కర్మశేషమ్ము భు • క్తమ్మొనర్చికొననీ
వసుధపైఁజేరు జీ • వవ్రజంబొ
జీవవ్రజంబులో • జీవించిముదిసికా
యమ్ములనూడ్చుమ • ర్త్యవ్రజంబొ
మర్త్యవ్రజంబులోఁ • మహితులఁదేఁగ ర్త
వంపనచ్చురమేశు • భటచయంబొ
తద్భటవ్యూహమ్ము • దాల్చవచ్చుకడాని
డంబుమీఁరినదుష్ప • టములడంబొ

తే॥ నాగఁదగువంగపండుల • నలువుమీఱు
పాంథులకుఁబర్వనిపరుపుల్ • పగిదిమీఱు
పలువితఁపుఁజెట్లగమ్రిండఁ • జెలువుమీఱు
నామనికముందురాల్ పండు • టాకుబాళు॥ 47

ఉ॥ డీలువడంగఁదోలెఁ బిక • డింభకపాళినిఁ దాదులాత్మ గే
హాళులనుండనీక విర • హార్తులగుండెలుతల్లడిల్ల హిం
దోళమునాలపించి రల • దోఁపురకాంతలు త్రెంచెదోట్లు వృ
క్షాళులఁజెల్లునల్లకొను • నాగురివిందఁపుఁదేనెనానుచున్॥ 48

సీ॥ మవ్వంపుటెలమావి • మ్రాఁకుకొమ్మలుకేవి
నలరుపెండిలిపేరఁ • టాంద్రుగాఁగఁ
గిలుకుటెల్గునఁగుల్కు • చిలుకకోయిలపల్కు
కొమరారుబల్ వాయి • దములుగాఁగఁ

దేనియల్ గ్రోలి మ • త్తిల్లిన తేంట్లమై
కప్పు వ్రేలిమిపొవల్ • చొప్పగాఁగఁ
వలపుమోపరిరాల్చు • బలుమల్లెపూచాల్పు
నాలుమగలతలం • బ్రాలుగాఁగఁ
తే॥ సుమలతావళిమంగళ • సూత్రములుగ
నలరుపొడితిన్నె పెండిలి • యరుగుగాఁగఁ
మాధవుఁడువనలక్ష్మికిఁ • మగఁడుగాఁగఁ
నవనిఁబెండిలిసేసెఁదా • నరుదుగాఁగఁ 49

తే॥ అనుఁగుటల్లుండయిన మాధ • వునకుఁగూతు
రైనవనలక్ష్మికిప్పించెఁ • భూనితంబి
నీమతల్లికానుక లెంతో • ప్రేమమీరఁ
బచ్చనాకులునాఁబట్టు • వలువ తేవలు
పాదపములను నెచ్చెలి • బారుచేత॥ 50

సీ॥ మవ్వంపుటీరపుం • బడకటింటనుమల్లె
పూవుఁజొంపవుఁబాను ••పునను గొమ్మ
గమిఁగ్రమ్మతలిరు మొ • గ్గపులకల్ చివురుటా
కులనులిగిల్కు-ప • ల్కు- నన తేనె
చెమ్మటల్ వలినాతి • తెమ్మెరల్ నిట్టూర్పు
కలిగిమాధవునితోఁ • గాటఁపుఁదమిఁ
బొన్న నేలకిపెన • గొన్న చెన్నునఁమారు
పోరున నెంతయు • నారి తేరి
తే॥ కొలసనీరుంపరల్ చిట్టు • ములుగఁబూవు
గుత్తులందగు తెమ్మెరల్ • గుబ్బమునల
నల్పుగాఁగఁజూలాలిత • నమునఁగాన
లచ్చికొమరుపిందెలబండు • లగనెనహాహా॥ 51

మ॥ పరదేశంబుననుండుభర్తలమదిఁ • వాంఛించు నిల్లాండ్రు నుం
దరులంగార్యపుటస్థుఁదీర్ఘిధవు నెం • టుఁబంపుతల్లాండ్రు లు

ర్వరఁజన్నంబులొనర్చువాండ్రుచలివేం • ద్రదల్ బెట్టుమొన్గాండ్రు వం
దురుప్రోయాండ్రునుగోడెకాండ్రునయిరం • దుంగందువాల్తాకులః

వ॥ ఇట్టులాపేరుటామని యామునేనుఁగుగోమునవిూరుచున్నంత నొ
క్కనాఁడు. 53

శా॥ వేగంటెంబురుడించుతండ్రికొలువు • న్వీక్షించిసుగ్రీవుఁడుం
గ్రీగంటందనమంత్రులంగనఁగ వుం • త్రివ్రాతమాఖేటకై
రాగంబూనె మహీశుఁడంచుఁబురివ్రా • రాజిల్లఁజాటించఁగాఁ
వేగంబోయలువచ్చికేమనుదు ను • ర్వీరుట్సురేంద్రాజ్ఞ హా॥ 54

తే॥ దేవతాంశభవుండౌట • నావిభునకుఁ
వేఁటయాడఁగఁమదిలోనఁ • వేడ్కపుట్టెఁ
గామరూపంబుకలిగిన • ఘనులయంశ
మఖిలసృష్టులఁనైపుణ్య • మందుగాదె॥ 55

వ॥ ఇట్లాఖేటఖేలనాధురీణులగు కిరాటులు వేఁటకనువగు మరువిండ్లవం
టివిండ్లు రిపుభయదమ్ములగుభల్లమ్ములు తృణీకృతస్మరభల్లమ్ము
లగుబల్లెమ్ములు హతవిమతస్వాంతమ్ములగుకుంతమ్ములు సమరజయ
ప్రదమ్ములగు తోమరమ్ములు ఖండితరిపుజాలమ్ములగు భిండివాల
మ్ములు వలలు నుఱులు జివురుఁగండెలు బోనులు పగ్గంబులు మొద
లుగాఁగల సాధనంబులతోడఁ బల్లజుంజురువెండ్రుకలనడరు సొగసై
నసిగలతోడఁ గోడెమొకరితుమ్మెదలనీడబుచ్చు మీసమ్ములతోడఁ
బట్టుధట్టులతోడ జుట్టుబొట్టులతోడఁ గారుమొగిళ్లనాగఁజాలుజగా
యొడళ్లతోడ సోగపాగాలతోడఁ గత్తిడాగులతోడ •ముతకదుప్ప
టులతోడఁ గుతుకంపుఁజప్పటులతోడ నేడనీడుజోడులేని సొగసూ
నివచ్చి వియచ్చరరాజు రచ్చలచ్చి నవలఁబుచ్చు రచ్చపట్టుఁజొచ్చి
యొకవంకవాది మొదలుగాఁగలకుమారరత్నంబులు కొండొకజాంబ
వదాదిమంత్రిసత్తములు తక్కువృకుచరులంతంతఁగొలువుదీరి దైవ
తశిఖామణులుగొలువఁ గొలువుండునింద్రుండునుంబోలె మెఱయు
చుండు ఋక్షవిరజుంగపిరాజరాజుఁగాంచి సభక్తిపూర్వకంబుగ

నమస్కరించి యువరాజునకంజలింజలిపి తమ్మురావించిన సుగ్రీవు
నకర్మిలి మ్రొక్కి వేఁటకాయితంబయిచనుదెంచితిరేయని చిన్నితే
డన సామి "సుగ్రీవాజ్ఞకు" వాఱుమాఱున్నదేయని యమ్మాయ
బోయకొలంపుబోయలిట్లనిరి. 56

గ్రామ్యపదయుక్తసీసము.

సూసినారయ్యోరు • సుందడిబొట్టీడు
తోకుచ్చుకొనియేదుఁ • దోసిసంపెఁ
గాసిగాడీడండి • కెగల్ మెకాల్ కంట్లఁ
జాలుచ్చుకొనె మొన్న • తోలుకొచ్చె
బాసిగాడీడండి • బాస తెంపదసియని
సెరబమెగాన్నొక్క • డిరుగ మొడిసెఁ
మోసినోడీడండి • ముట్టెమెగాల్ జోడు
మాసెంబుతర్వాత • మాలొపెద్ద

తే॥ యాండ్లతల్లన్ని దోడండి • యీరిగాడు
బెబ్బులేటాడిల్లోకేడు • దొబ్బలేడు
పెగ్గగల్గోడునాతోటి • నిగ్గలేడు
పులుఁగువేటన్న సింగఁడు బుజ్జగాడు॥ 57

వ॥ అందుఁ గొందఱుబోయలిట్లనిరి. 58

సీ॥ హరిణాక్షభృద్ధస్త • హరిణపోతమునైనఁ
వలకుఁలోఁజేయునీ • పదములాన
పరమేశ్వరీవాహ • దరఁముబోనునైనఁ
వశిబడఁజేయుఁనీ • పదములాన
ధర్మరాజువాహయంపుఁ • దంటనైనంబైనఁ
బడిలొంగఁజేయుఁనీ • పదములాన
కకుబంతములహస్తి • ఘటలఁబాహులనైనఁ
బట్టఁగాడాయునీ • పదములాన

ఆ॥ ఈసివంగిమిత్తి • యీమల్లెపూగుత్తి
ఈపిరంగిగుండు • లేపిగండు
ఈకడానికంటి • యీమగతాబంటి
ఈతుపాకిమందు • యేమందొ తమ॥ 59

చ॥ కవిసెమమీఁదికింబడెఁడి • గజ్జెలపట్టెడ బ్రమోతఁ గోడబి
ట్టవిసెముగుండెపట్టులు మ • హార్భటిసూడఁగడంకఁదాకినం
బవిసెముజుండెకుక్కలివి • పక్కఁలముక్కులఁజక్కనొక్కఁగాఁ
గవిసెదుడేగబారులవి • కాంచుమటంచుఁవచించు చెంచులన్॥ 60

వ॥ ఇంచుకంత శ్రీగంటవారించి బ్రమోలఁ దిలకించునంతలోన 61

ఉ॥ పోశిమిమూనికంపుఁమొగ • ముట్టునుబీలిగఱుల్ తలాటము
న్వాశిమెఱుంగుఁబాణములు • నారసఁపుంబొది గత్తివిల్లు సు
ప్పాశిమెఱుగుఁ ముత్తియఁపుఁ • బక్కెరఁబల్లమ్ము వాగెఁ బన్నికం
ఖాశిమిహింగల్లొడిని • గైకొనిసాహిణి తెచ్చెఁదెచ్చినన్॥ 62

వ॥ అంతసుగ్రీవుండు 63

మ॥ మునుమున్ బుల్గుల రాచతాబొమిడికం • బున్మ్రాలతాగత్తళం
బునుసుప్పాణిమెఱుంగుముత్తెఁపుసరం • బున్ మేల్మిచౌకట్లజో
డునుహొంబట్టుజిలుంగు రెంటెమునునీ • టుంగుల్కుకస్తూరిబొ
ట్టునుమేల్ చందురుకావిదట్టియునునీ • టుంగోటుమ్మ్రోత్రావిచేన్॥ 64

క॥ ఈలీలం దాలిచి నెఱి గేలలకోరిలవిల్లు • గీల్కొల్పపొదిం
గాలనిశికెంపుబావలు బాళినిసాంబ్రాణికెక్కి • పైనంబయ్యెన్॥ 65

శా॥ పైనంబైననిజోగ్రులర్కజుఫుకో • భాగంబునందశ్వరా
డ్యానారోహణమాచరించి తమిడా • యంబోయలున్మ్రాపులన్
పైనంబేర్పడఁబోనులున్వలలు తే • వందాల్చిరాఁ బెంట్లికిం
పైనంబై చనులాగువారెమనికిన్ • వాద్యార్భటుల్ సెల్లఁగాన్॥ 66

వ॥ ఇట్లుచనునెడ 67

మ॥ జముగారాబఁఫుఁదమ్మ్రుఁగుజ్జుఁడడిస • జస్యందనంబు స్మదే
భముగాఁ కేచితవల్గితప్లుతములా • స్పంబాఱఁగాఁగాంచి ౯ం

దమునంజాలఁగసంతసింపుచటఁ జెం♦తంబాటచేలన్ మహీ
జములందోఁటలఁ బాటలంబయిరు లి♦చ్ఛంగాచుపూఁబోఁడులన్ ॥ 68

వ॥ కనుంగొనిముందట 69

ఉ॥ తమ్ములవిందుకందు కను♦దమ్ములనందముగుల్కఁగాంచెఁ స్వాం
తమ్ములనబ్బురంపడి ము♦దమ్ములఁజెందఁగబోయుగుంపు నె
త్తమ్ములనుండిమార్గవిత♦తమ్ములజారెడునెమ్మపాలఁ బా
తమ్ములకాగజారి నిహ♦తమ్ములమైనకడిందిపందులన్॥ 70

క॥ ఏనికలమస్తియేముల్ మానికములనేయికడలి♦ మాద్రిగఁబాఱం
బూనికవెదురులముత్యాల్ మానికములలాగుపరవ♦మటిజేఁడుగనెన్

## హిమవన్నగవర్ణనము

చ॥ మృగధరుఁడైనవానిఁ ముని♦బృందముకొల్వఁగనొప్పువానిఁ మిన్
సిగగలవానిఁ జందురుని♦నిందయొనర్చెడుకాంతివానిఁ బె
న్నగనదునీతరంగముల♦నానెడునాదలవానిమేనకా
సుగుణయుతాత్మజాభిరతిఁ♦జొక్కుముదంబుధిదేలువానినిన్॥ 72

సీ॥ కన్నతండ్రియసూయఁ♦గన్నతండ్రియటంచు
నార్యయెవ్వనిగర్భ♦మందుఁబుట్టె
రాజశేఖరుఁడద్రి♦రాజశేఖరుడంచుఁ
బ్రార్థించియెవ్వని♦పట్టిఁగొనియెఁ
దానమేనగఁమని♦తానమేనగమని
నవ్వుమేనకఁగూర్మి♦నెవ్వఁడేరెఁ
మొదవుపంటవలంతి♦యొదవుఁబంటవలంతి!
యన్నవత్సంబెవ్వఁ♦డయ్యెనాఁడు.

తే॥ పల్లవులఁగూడిదైవత♦హల్లకేక్ష
ణలుస్మరక్రీడపొంబె కం♦దరములెందుఁ
గూర్మిమైనెమకుచురట్టి♦గుబ్బలదొరఁ
గన్గొనియెఁగాముఁరాబట్టి♦గట్టుపట్టి!॥ 73

క॥ ఇటుగనితత్కటకమునకుఁ దటుకునఁబోయిసకలర్తు • ధర్మంబులను
త్కటపర్ణపుష్పదళఫల పటలావృతవిటపిబహుళ • వనముంగాంచెన్॥

క॥ కనిముదమునంది బోయలఁ
గనియిచ్చటమెకపుఁబసుపు • గలవెక్కుడుగాన్
గనివానిత్రోవ నవిరా
గనివేఁటాడుమనఁ వేడ్క • గదురుగఁవారల్॥ 75

తే॥ వలలనొడ్డించిబోనులు • వన్ని మెఱుఁగు
బల్లెములనీటెలంగొన • పములఁబరపి
పూనిరిమెకంపువేటకుఁ • బోయలంతఁ
బ్రొద్దుకొమరుండువారలఁ • బురికొలుపుచు॥ 76

బోయలతోఁగూడి సుగ్రీవుఁడు మృగముల వేఁటాడుట.

ఉ॥ తాఁకఁగనిల్చుత త్తడిని • దట్టికరమ్మునఁ జిల్గువల్వచేఁ
జోఁకఁగ వల్లెవాటుడిపి • చొక్కపుటంగిబిగించి ప్వేషుధిన్
వీఁకఁగదల్చి భల్లములు • విల్లుజరీలునఁదూసి నెత్తముల్
గ్రీఁకఁగఁగ త్తలాని దుమి • కింపుచు నేసికిరాటులార్వఁగాన్॥ 77

క॥ సింగంబులగ్రేల్గురుకు కు రంగంబులమత్తమధుక • రప్రకలితమా
తంగంబులయుంగంబుల భంగంబులుకాగగొట్టెఁ • బటుదోశ్శక్తిన్॥

సీ॥ ప్రణతార్తిహరుఁడుమా • రమణుండుశరణన్న
మనచుట్టమంబలె • మనుప వేడ
ప్రజలధర్మాధర్మ • పాళిఁదీర్పు యముండు
మనచుట్టముంబలె • మనుప వేడ
యెల్ల ప్రులఁబ్రోచు • నల్లజేజేచెల్లి
మనచుట్టముంబలె • మనుప వేడ
తమముఁబోఁదోలిచి • త్తమెలర్చుజాబిల్లి
మనచుట్టముంబలె • మనుప వేడ

తే॥ యనుచుఁద త్తస్థలమ్ముల • కరుగనురుకు
కరణిఁబరువిడుజింకలఁ • గాసరములఁ

సింగములతేళ్లనుగ్గాడి ◆ రంగుమీఱఁ
బంతములఁబల్కుచాబోయ ◆ చాంద్రదునార!॥ 79

లయగ్రాహి. దట్టమగుపూఁబొదలఁ ◆ దిట్టమగుబోనులను
బెట్టికదుఁదాఁపునను ◆ గట్టుపయినొక్కం
డెట్టుమొకమల్కడగు ◆ నట్టుకనుమల్పుచల
చెట్టుపయివానికల ◆ గట్టుదొరమూల్ మేల్
తట్టునలువచ్చిరహి ◆ ప్రుట్టఁగనిబోనులను
గట్టిడిన యేడికలఁ ◆ బట్టజనఁబోనుల్
జట్టునసుమూసిరహిఁ ◆ ప్రుట్టఁదమరాజనకుఁ
గట్టనునిబోయగమి ◆ పెట్టిరోగిముందుక్ 80

వ॥ అంతనంతకానుజుండు 81

స్రగ్ధర. ఖండించెంగండుమైను ◆ త్కటభయదఁపుంపిం
గంబులంగొండ గోల్లం
దుండించెందచ్చికాల్లం ◆ దోడరుమొకములం
దుష్టశార్దూలపఙ్త్కిం
జెండించెంసుప్పిపౌజం ◆ జిఱుతకఁణునులం
జెందేఁబోత్రివజంబుల్
వంచించెన్మ్రాసమెల్ల ◆ న్వడినడినెఱుసుల్
బాణుపంచుబ్బుజెందన్॥ 82

క॥ ఉసికొలిపివిడువఁ గుక్కలు
పసివట్టుచుఁబొదలఁదూఱి ◆ పందులమందం
గసిమసఁగెఁనంతసమ్మునఁ
విసరు మందమత్తోకలడవి ◆ వెసఁదిరిగియహా!॥ 83

క॥ అత్తెములనుంచి డేగల
మొత్తమ్ములనెగురఁ జేయఁ ◆ ముసరిచదలునం
జిత్తములలరఁగఁ బులుఁగుల
మొత్తమ్ములనిడ్చి తెచ్చెఁ ◆ మొగిఁనారకడకున్॥ 84

వ॥ ఇట్లు మెకమ్ముల వేటాడు కిరాటులం బోటించి వేటయందుం జాల బడలితిరింక వేటతమకంబులాడింపుఁడని వాలితమ్ముండు పల్కుకుటయు నా చెంచునాయకులు 85

ఉత్సాహము. పునుఁగుఁ గస్తురంటిపంప్లు • బుట్టతేనె చాలపప్పును సలుంగుకొమ్ము సవర • పున్నెకాలు నక్కకొమ్మును జవాది మేలిపీలి • పులుగుగఱులు గప్పురంబు నెగిఁ బుట్టనించి నెరకుఁ • ముందుఁ బెట్టి మ్రొక్కినన్ 86

క॥ మన్నించిపసదనమ్ముల
నెన్నఁగఁ మంత్రితతిచేత • నిప్పించిరి హిం
దిన్నగఁబురిమానక అంగఁగఁ
దన్నగచరయూథఁపుండె • దండలంచి వెనన్ ॥ 87

ఉ॥ పిల్లులకుంబలెందిరుగు • బెబ్బులిపిల్లలఁ మేలిమూలికా
వల్లుల నెల్లుబిల్లలను • వల్లిమతల్లులఁదిర్యమల్లుతో
భిల్లులపిల్లలంబునుగు • బిల్లులపిల్లలఁబల్ జవాదినుం
బిల్లుల నెల్లనల్లఁగొని • వెళ్లిరి కానొక చోటఁ వేడ్కమై॥ 88

సుగ్రీవుండు శంభరీపురీవనంబుఁ జొచ్చి విశ్రమించుట.

మత్తకోకిల. మత్తకోకిలశారికా శుక • మంజునాదవిచిత్ర సం
పత్తికిన్ ఫలపుష్పధర్మవి • భాగమానవమహీజ సం
పత్తికిన్ నవపంకజాకర • పద్మబంభరగాన సం
పత్తికిన్నెలవైతనర్చిన • వన్యమొక్కఁడుగన్గొనెన్ ॥ 89

మ॥ కని తత్పాలకలోకముంగరుణ దో • ల్కంబల్కి పిల్పించి పా
వనమూనీవనపాళిఁబాళిమెయి నే • భద్రాఖ్యకాంతాళిగో
మునఁ జెల్లాడెడుచోటులో కడిమినే • భూపాలుడీభూమిఁ సం
తసగాఁబాలనఁ జేయునో తెలుపు మ • న్నవ్వారలుం బ్రీతిమై॥ 90

ఉ॥ ఇట్లనివిన్నవించిరి ప్ర • హృష్టమనస్కులునాచునాజగా
జెట్టినిగాంచి దేవ! గుణ • సింధు వుదారుఁడు సూర్యఁగన్న యా

పట్టెనిరంతరంబుఁదన ♦ పైదలిపింఛుకడిందిపోఁడి మిం
జుట్టునుఁగూడిరాఁగఁ సాఁగ ♦ సుంగులుకుంజరియించునీవనిన్ ॥ 91

ఉ॥ ధీరుఁడుభూరిభూమిధర ♦ ధీరుఁడుసద్గుణవారుఁడర్థి మం
దారుఁడుభూరిభూషణుఁడు ♦ దారుఁడుశూరుఁడువైరివీర సం
హారుఁడునీతిసత్పథవి ♦ హారుఁడువార్ధిగభీరుఁడైన యా
తారుఁడుశంభరీసమభి ♦ ధానమునీపురి నేలుచుండెడిన్ ॥ 92

చ॥ వెలయఁగఁనిట్టువల్కి కథు ♦ వేడుకదియ్యనిపంక్తులఁబువ్వుఁటు
త్తులలరుఁదేనియల్గరిమ ♦ తోనిడిమ్రొక్కినఁబ్రొద్దుపట్టి వే
డ్కలలరఁవానిఁబుచ్చికొని ♦ క్రచ్చరఁమున్ననఁవారిఁబుచ్చి నే
టిలఁననదోటలోఁ బటకు ♦ టీరములోఁనివసించి కూర్మిమై। 93

ఉ॥ మూకలుజుట్టుకొల్వ నెల ♦ పూవుల తేనియలాని జుట్టుపు
ల్గీకలఁగట్టుపీవనల ♦ నెంతయుఁవీవఁభటాళి తియ్యనౌ
దాకలపంక్తులింపుఁబువు ♦ దండలఁదాల్చిముదబ్ధిఁదేలుచున్
మూకలఁజేఁదుబ్రొద్దుఁరహిఁ ♦ బుచ్చుచునుండిరి శైలనందనా!॥ 94

రుమాకుమారిచెలులతోఁ వనవిహారంబున కేఁతెంచుట.

ఉ॥ అంతకుమున్న శంభరిపు ♦ రాధిపుకూరిమిపట్టిసూ రుమా
కాంత కుమారికామణుల ♦ ఖండకళావిభవంబులన్ రమా
కాంతకునెత్తువత్తురనఁ ♦ గాఁదగివెంటనురావనేందిరా
కాంతకుదోహదంబిడుట ♦ కాయనఁబోయెనుగేళిలోలమై। 95

ఉ॥ తోరఁపువేడ్కనెచ్చెలుల ♦ తోనిటులింతులమేలుబంతి క
ర్పూరఁపుటింటితోఁటకయి ♦ పోవుచునుండఁగఁద్రోవఁబోంట్లు సిం
గారఁపుఁబల్కుపల్కుల జ ♦ గాజిగిచిందఁగఁబల్కి పల్కుక
ర్పూరఁపుఁబల్కుకాంతినగు ♦ మోములకున్నెఱుఁగీగిరాబళా!॥ 96

లయగ్రాహి. సొమ్ములబెడంగు వద ♦ నమ్ములహారంగును గ
రమ్ములమెఱుంగు కడి ♦ యమ్ములపసం దం
దమ్ములగుకంచుకయు ♦ తమ్ములగు గుత్తపుఁ గు
చమ్ములచొకాటము ము ♦ దమ్ములనిడంగా

నిమ్ములమెలంగెడు శు • కమ్ములజెలంగెడు పి
కమ్ములవలెంబలికి • నెమ్ములవలెఁ హం
సమ్ములవలెఁ నడచు • చుమొమ్మలకనవ్వుల సు
మమ్ములనుగోయుచు వ • నమ్ములకఱుంగఁ 97

వ॥ ఇట్లుఱుగఁదదీయ వనలక్ష్మిదేవతామతల్లి చెల్లియలనంజాలు రుమా
కుమారీమతల్లి నత్యంతగౌరవంబున నెదుర్కొని గారవించితోడ్తర
ననుపవచ్చు చేటీవధూపటలంబునానెప్పు • కమ్మపొందమ్మిపుప్పొ
డి దుమారమ్ములఁజిమ్మిరేగు బాలసమీరకిశోరవారమ్ముల తాకు
లకుసంతసింపుచు నాత్మీయకుటుంబినీనివహా విభ్రమభ్రమణమనీషు
లయి తమనిద్దంపుటద్దంపుసొంపునింపు ముద్దునెమ్మొగమ్ముల విద్దె
మ్ముఁజల్వు నిలవుటుఱులనెఱులఁదఱుము ఝుంగురులుగూడవచ్చు
మత్తమధుకరనికరమ్ముల పెనుమ్రోతలకు వారవారమ్ములికి
పడుచుఁ గరకమలమ్ముల నెమ్మొగుల్కవాసినదల్చుచు మఱియుబింబ
ఫలాపేక్షాతురత్వమ్మున మధురాధరమ్ములఁజెనకవచ్చు శుకడింభ
కమ్ములఁజోపుచు వెండియుఁదమగిల్కు పలుంగులంబల్కు పలుకు
లాలకించి స్వాంగనారత్నంబులోయనుశంకంగూయు కోయిలపిండు
డాయఁబల్కుచు నంతంతవనవతంసంబు డాయనఱుచెంచి తమదేవిం
గాంచి నెచ్చెలులిట్లువక్కాణించిరి. 98

చెలికత్తెలు తమదేవితోఁ బ్రసంగించుట.

ఉత్సాహము. క్రమముగాననంగునకును • గరణపటిమ కనకగం
ధము లెఱుఁగనివానికిష్ట • ద్రవ్యకలన చాలకా
లమునుమాటలేనిమూక • లకును వాక్పటుత్వముం
గమనరహితవర్గమున క • ఖండపల్లవాభి వృ
ద్ధిమహిమంబునిచ్చువనమి • దేపొడఁగనుపైదలీ!॥ 99

మ॥ ఒదవంబల్ నునుగెంపుసొంపుజివురుల్ • పూఁబట్టుటెక్కెంపు సం
పదమాకందమనోజిరాజరథముల్ • మత్తాళిపాళిగుణ

పట్టెనిరంతరంబుఁదన • పైదలిపింఛకడిందిపోఁడి మిం
జుట్టునుఁగూడిరాఁగ సాగ • సుంగులుకుంజరియించునీవనిన్॥ 91

ఉ॥ ధీరుఁడుభూరిభూమిధర • ధీరుఁడుసద్గుణవారుడర్థి మం
దారుఁడుభూరిభూషణుఁడు • దారుఁడుశూరుఁడువైరివీర సం
హారుఁడునీతిసత్పథ వి • హారుఁడువార్ధిగభీరుఁడైన యా
తారుఁడుశంభరీసమభి • ధానమునీపురి నేలు మం డెడిన్॥ 92

చ॥ వెలయఁగనిట్టువల్కి కపు • వేసుకదియ్యనిపండ్లఁబువ్వుఁటు
త్తులలరుఁదేనియల్ గరిమ • తోనిడి మొక్కినఁ బ్రొద్దుపట్టి వే
డ్కలలరఁవానిఁబుచ్చికొని • క్రచ్చరఁమన్ననఁవారిబుచ్చి నే
టిలఁననదోటలోఁ బటుకు • టీరములోఁనివసించి కూర్మిమై॥ 93

ఉ॥ మూకలుజుట్టుకొల్వ నెల • పూవుల తేనియలాని జుట్టుఫు
ల్గీకలఁగట్టువీవనల • నెంతయుఁవీవఁభటాళి తియ్యనా
దాకలపండ్లుతించుఁబుపు • దండలఁదాల్చిముదబ్ధిఁదేలుచున్
మూకలఱేఁడుప్రొద్దుఁరహిఁ • బుచ్చుచునుండిరి శైలనందనా!॥ 94

రుమాకుమారి చెలులతోఁ వనవిహారంబున కేఁతెంచుట.

ఉ॥ అంతకుమున్న శంభరిపు • రాధిపుకూరిమిపట్టి సూ రుమా
కాంత కుమారికోమలు ల • ఖండకళావిభవంబులన్ రమా
కాంతకునెత్తువత్తురనఁ • గాఁదగివెంటనురావ నేందిరా
కాంతకుదోహదంబిడుట • కాయనఁబోయెనుగేళిలోలయై॥ 95

ఉ॥ తోరపువేడ్క నెచ్చెలుల • తోనిటు లింతులమేలుబంతి క
ర్పూరపుటంటితోటకయి • పోవుచునుండఁగ ద్రోవఁబోంట్లు సిం
గారపుఁబల్కుపల్కుల జ • గాజిగిచిందఁగఁబల్కి పల్కుక
ర్పూరపుఁబల్కుకాంతినగు • మోములకున్మెఱుఁగీగిరాబళా!॥ 96

లయగ్రాహి. సొమ్ములబెడంగు వద • నమ్ములహారంగును గ
రమ్ములమెఱుంగు కడి • యమ్ములపసం దం
దమ్ములగుకంచుకయు • తమ్ములగు గుత్తపుఁ గు
చమ్ములచొకాటము ము • దమ్ములనిడంగా

నిమ్ముల మెలంగెడు శు • కమ్ముల జెలంగెడు పి
కమ్ముల వలెం బలికి • నెమ్ముల వలెన్ హం
సమ్ముల వలెన్ నడచు • చు మొమ్ముల కనవ్వుల సు
మమ్ముల నుగోయుచు వ • నమ్ముల కఱుంగన్ 97

వ॥ ఇట్లుఱుగఁ దదీయ వనలక్ష్మీదేవతామతల్లి చెల్లియల నంజాలు రుమా కుమారీమతల్లి నత్యంతగౌరవంబున నెదుఁర్కొని గారవించి తోడ్తర ననుపవచ్చు చేటీవధూపటలంబునా నొప్పు • కమ్మపొందమ్మిపుప్పొడి దుమారమ్ములఁ జిమ్మిరేగు బాలసమీరకిశోరవారమ్ముల తాకులకు సంతసింపుచు నాత్మీయకుటుంబినీనివహ విభ్రమభ్రమణమనీషులయి తమ నిద్దంపుటద్దంపుసొంపు నింపు ముద్దునెమ్మొగమ్ముల విద్దెమ్ముఁ జల్పు నిలుపుటుఱుల నెఱులఁ దఱుము ముంగురులుగూడ వచ్చు మత్తమధుకరనికరమ్ముల పెనుమ్రోతలకు వారవారమ్ములికి పసుచుఁ గరకమలమ్ముల నెమ్మొగుల్కు వాసిన దల్చుచు మఱియు బింబఫలాపేక్షాతురత్వమ్మున మధురాధరమ్ములఁ జెనకవచ్చు శుకడింభకమ్ములఁ జోపుచు వెండియుఁ దమగిల్కు టులుంగులం బల్కు పలుకు లాలకించి స్వాంగనారత్నంబులో యను శంకంగూయు కోయిలపిండు డాయఁ బల్కుచు నంతంత వనవతంసంబు డాయనఱుదెంచి తమదేవిం గాంచి నెచ్చెలులిట్లు వక్కాణించిరి. 98

చెలికత్తెలు తమదేవితోఁ బ్రసంగించుట.

ఉత్సాహము. క్రమముగా ననంగునకును • గరణపటిమ కనకగం
ధము లెఱుంగనివానికిష్ట • ద్రవ్యకలన చాలకా
లమును మాటలేనిమూక • లకును వాక్పటుత్వముం
గమనరహితవర్గమున క • ఖండపల్లవాభివృ
ద్ధిమహిమంబునిచ్చు వనమి • దేపొడఁగను పైదవీ!॥ 99

మ॥ ఒదవం బల్ నును గెంపుసొంపు జివురుల్ • పూఁబట్టు టెక్కెంపు సం
పద మాకందమనోజరాజరథముల్ • మత్తాళిపాళిగుణ

చ్ఛదపాంసువ్రజచక్రముల్ దొరలనో • జఁలాగమాహాబలం
బు దగంగొమ్మలుజల్లుపూలనశుకం • బుల్ దిర్వఁగంటే చెలీ!॥ 100

ఉ॥ తీయనిపంచదార వెను • తీయనిరంతరసూపువల్క నిం
తీ! యనివార్యవాక్కనక • తీయనివింటిమనీని తేజ ని
తీయనిపల్కుఁగాంచ బిగి • తీయనిబల్ తపమూనినట్లు మేల్
తీయనిపండ్లుదించునల • తీయనిమావినినిల్చెఁగంటివే॥ 101

ఉ॥ ఓమృదుమవాణి! కాంచితివొ • కో? కలకంఠముకండక్రొవ్వ నీ
దామృదువాగ్విలాసమున • హుంకృతిమైఁబడయుంగఁగోరి యొం
తేమృదుపల్లవవ్రతతిఁ • దించుఁదపంబొనరించికాంచి, వా
చామృదుమాధురీమహిమ•జక్కఁగఁగూసెడుదియ్యమావిపైఁ 102

సీ॥ నీపట్టినదియపో • నెలఁత! మాకందమ్ము
నీమెట్టినదియపో • నెఱీనశోక
మావర్మిలింగన్న • దేమేల్మితిలకమ్ము
నీవెదవిడినదే • తావిక్రోవి
నీరాగసంపద • నిండినదిప్రియాళు
వీవెదిర్చినదిపో • హేమరాజ
నీపుకల్లుమియనేం • తేనలరువొగడఁ
నీనవ్వునదియచె • న్నైనపొన్న

తే॥ నీకులుకుఁబల్కు తేనెలెం • తేనినాని
నదియపోకర్ణికారంబు • నతివ! కాన
గనఁగనేటికిభేదాన • గొనఁపు,గోన!
కొనవె సూనమ్ములుద్యాన • వనములోన॥

రుమాదేవి బోంట్లతోఁ బూలుకొనుట. 103

తోటకము• వనితామణులవ్వన • వైభవమి
ట్లనిదేవికినర్మిలి • నాడుచుఁగ
మ్మనిపెన్నెఱులొయ్యన • మచ్చిజడల్
ననలంగొనవేడ్కఁగ • ణంగిరొగిఁ॥ 104

వృషభగతిరగడ.

చెలువ! చెలువఁపుఁజందనములవి • చిలువ చెలువలకునికిపట్టులు
పలువ! పలువరుసలను బైటిడఁ • బలువపలువవటందు బెట్టులు
కమ్మకమ్మరసాలసాల శు • కమ్మకమ్మనఁజిక్కుఁ గోవిని
రమ్మరమ్మసుమమ్ములాడవుఁ గ • రమ్మరమ్మననుంపఁ గ్రోవిని
కొమ్మ! కొమ్మలలాగ కలరులఁ • గొమ్మకొమ్మలఁ దవ్వులుతమ్మెలు
నమ్మనమ్మక చెల్ల! చెలిభవ • నమ్మనమ్మఁగఁ దానిబూమెలు
కలికి! కలికిమెఱుంగుఁ దుమ్మెద • కలికికళికి తెమొంతగోలవు
పలికిపలికిపికాళినలె,గరు • వలికివలికి తెకాంత! బేలవు
సారసారసచక్రహంసలు • సారెసారెకుఁ బఱచెఁగనఁగదె
ధీరధీర! మదాళిరొదఁ దమి • దీరదీరములందుఁ వినఁగదె
నారి! నారికెడమ్మబంభర • నారినారిఁగలానికిడవలె
దూరిదూరిపొదల్ నెలంతల • దూఱిదూఱిననల్ గొని తెబలె
కానికానినప్రేమఁబూవిలు • కానికానియలినినొసంగితిఁ
బూనిపూనిడనాకుఁసిగ్గును • పూనిపూనిడ కే మొఱంగితి
నేల, యేకితీవ తేవలె • నేలయేల నెపోవగడగెదు
మేలమేలనె బాలికామణి • మేల మేలము లెపుడునుడి వెదు
బాళిబాలిక! గిల్లకుముపిక • పాళిపాలిటిచివురులవి చెడు
నాళినాళిబలమ్మచుట్టవ • నాళిఁనాళికనేత్రి బఱచెడు
నళికినళికి కళికఁగొనకఁజన • నళికినళికినదంచునవ్వరె
కలికి! కలికి తెవలుకచమ్ములఁ • గలికికళికిరుగడలఁ గ్రుప్పరె 105

రమచెలులతోఁ గొలఁకునఁ జల్లులాడ నేగుట.

మ॥ వనజాక్షుల్ వనకేళిసీపగిది తే • నల్మీరఁగా దేలిత
ద్వనకేళింగి మేచులుఁ మొగములుఁ • వక్షోరుహాచ్ఛన్న కాం
చన చేలమ్ములు కప్పఁగొప్పులు రజ • చ్ఛన్నమ్ములై యొప్ప నో
జనఁగైదమ్ములతో విదిర్చికొని కా • సారావగాహచ్ఛటన్॥ 106

తే॥ పఱచు రాయంచసంచులఁ • బట్టిపట్టి
మెఱయుపుప్పొడితిట్టల • మెట్టిమెట్టి
కమ్మపూదేనెకాల్వలఁ • గట్టికట్టి
సొరిదిక్రంపుటనఁటులఁ • జుట్టిచుట్టి 107

సరోవరవర్ణనము.

సీ॥ వెలిదమ్మిఁద్రిమ్మరు • విరిద్రిమ్మరులుముద్దు
మొగముపైముంగురుల్ • మఱుపుఁజూపఁ
దరగయుయ్యాలలనెం • తయునూగుజక్కవల్
తఱులపైఁజెందోయి • తెఱఁగుదోఁపఁ
గలువపూవులగుల్కు • గండుఁదుమ్మెదదిమ్ము
సొబగుఁగన్గవచూడ్కి • సొంపుఁజూపఁ
గప్పఁదేరెడునాచు • గప్పుచేపలగుంపు
సికపైనిమల్లెపూల్ • చెలువుదోఁపఁ
తే॥ నలువ తేజీలనడకనె • న్నడలుగాఁగ
బవడఁపుందీవెజిగిమేని • పసలుగాఁగఁ
దొనరుఁగెందమ్మితూండ్లు కేల్ • దోయిగాఁగ
బరగుకొలఁకులచ్చినిగాంచి • రరుదుగాఁగ 108

వ॥ ఇట్టులబ్బాలికామణు లక్కమలాకరమ్ము చెంతకుంజను నప్పుడు.

క॥ నెమ్మినలమించుఁబోండ్లకుఁ దమ్మికొలఁకులచ్చికల్వ • తమ్మివలపులం
దెమ్మెరకుట్టనిచేతికి నెమ్మొదొలుకనొసగికాన్క • యిమ్మనిపుచ్చెన్

క॥ అనిచిననెమ్మినిఁబనివిని చనవుననక్కాన్కఁమోద • జనకమ్ముగన
న్వనితలకిడివాఁడలమొద లనకలవలపుటుడుగరలఁ • లలిగొనిచనియెన్

వ॥ ఈవంకఁగళంకఁదేఁటి నారీమణులు, సిరిదొలంకు కొలంకు కొలం కునకుంజని

జలక్రీడాభివర్ణము

మ॥ మహిళారత్నములెల్లఁ మేలయినహంసం • బట్టంచుపుట్టమ్ములన్
మిహికట్టాణిమెఱుంగుముత్తెఁపుసరుల్ • మేల్కంచుకవ్రాతమ

మ్మహిఁ బైనూఁడిచిపెట్టి జిల్గువలు వల్ • మైనొప్పఁగాఁజుట్టి త
న్మహికాంబుల్ వెలిఁబెట్టుసౌరభమిళ • న్నీరంబులందోఁగఁగన్ ॥

సీ॥ తమజడలకునోడి • తఱలుతీఱునఁగప్పు
దేరెడునాచున • ల్ దెసలఁజేరఁ
దమనడలకునోడి • తఱలుతీరుననంచు
పదుపుసోపానాళి • పైకిఁజేరఁ
దమకన్నుఁగవకోడి • తఱలుతీరుననల్ల
గల్వలొక్కుమ్మడిఁ • గట్టుఁజేరఁ
దమచన్నుఁగవకోడి • తఱలుతీరునఁదోనఁ
జక్కవకవలొక్క • చక్కిఁజేరఁ
తే॥ దమమొగమ్ములకోడిన • దారితమ్మి
లిమ్ములనువీడి పెరయిమ్ము • లెమ్మెఁజేరఁ
దమకురులుకుజూడ్కి కోడిన • దారిఁభ్రమర
నివహముల్ బర్వనెలఁతుకల్ • నీటఁదిగిరి ॥ 114

వ॥ ఇట్లుజలంబులం డిగ్గి 115

ఉత్సాహము. బాహువల్లరులనుబట్టి • పంకజాక్షుఁడెల్లరు
త్సాహములనుసరసిలోని • జలములోతుఁగంచుఁద
ద్బాహునాళములనునీరుఁ • బైకిఁజిమ్ముఁదుంపరల్
మోహమునఁగనంగనొప్పెఁ • బోంట్లజల్లులాటకుం
దేహముబ్బిమరుఁడుగురియు • దివ్యకుసుమరాజినాఁ 116

తరల. తరళలోచనలంబుకేళిని • ధాటిఁజల్లఁగఁవారిసుం
దరలసత్తనుకాంతులొప్పెఁగ • నంగఁదత్సరసీఫణా
ధరలతాంగులు వారిసుందర • తావిభూతిఁవహింపఁబం
ధురలసత్సరసిందపంబుల • నుంబొనర్చినమాద్రిగాఁ ॥ 117

సుగంధి. చంచలాక్షియోర్తుపద్మ • సౌరభమ్మురేఁగఁదాఁ
బంచశాఖతోమృణాల • పాళిఁబీకినూకియో

మించుఁబోఁడి యోలయంచుఁ ♦ మేలమాడి దూకనం
దించుకేఁ సుగంధినీట ♦ నీదితా కేఁదన్విహా! 118

చంచరీకావ్రాలుంగట్లీలీలక్ ♦ వ్రాలుపూద్రిమ్మరుల్ మేల్
లీవృత్తము. చాలుంగన్గోజోఁపం ♦ జంచరీకాళులే చెం
గ్రాలుంగంట్లందంపుం ♦ బ్రస్ఫురద్వక్త్రముల్ పైఁ
జాలంగ్రాల్ మద్రాళుల్ ♦ సాటినెంచఁ ధాటినెంతేఁ ॥ 119

తోదకము. ఓలలనిదల్లలితో బకపంక్తిం ♦ బాళినినీక్రియఁ మానిను లెల్లం
గేళినిఁజల్పియుకిల్బిషరీతిఁ హేళినిఁగట్టున ♦ క్రైచనిరందక్

చంపక కుల్కుచుఁ వారుతీరమున ♦ కుంజనిసాంద్రపటమ్ములూడ్చిహేమం
గర్భితో గొల్కులపట్టుపుట్టములఁ ♦ గొబ్బునఁ దాల్చిసువర్ణభూషలం
త్పలము. దల్కుటొడళ్ళఁ బెట్టినృప ♦ నందనముగ్గయిసేసితేనెలే
యొల్కఁగమాటనిచ్చిరిన ♦ వోత్పలచంపకమాలలామెకున్

చెలులురుమనలంకరించుట.

వ॥ మఱియును. 122

శా॥ అంతంగ్రోవులమావులందగునవో ♦ ద్యానాంతరంబందుఁగ్రొం
దంతంపుంబనిపైఁడి మేడకును దం డందేనియల్వ్రాఁకకుం
జెంతంగ్రొంబువుజప్పరానఁ నెలతా ♦ చిన్నారిమేల్తిన్నెపైఁ
గాఁతంల్తారుననుంగుబట్టినిడి చో ♦ క్కాకెంపుటాపీటపైఁ ॥ 123

శా॥ గోటంగస్తురిబొట్టుఁదిర్చి నుదుటం ♦ గోటారనెమ్మేనఁ బ
న్నీటంగల్పినచందనంబలది బల్ ♦ నీటారఁగాహొన్నగల్
ధాటింగన్పడఁ బెట్టి గాగరను నం ♦ దంబొప్పఁగాఁగట్టి మేల్
శాటింగం చెలమీఁదుగాఁదిగిచి మె ♦ చ్చంజానఁగై సేసిరా! 124

రుమాదేవిఁజెలులు నెత్తమాడఁ దాను పాటఁబాడుట.

శా॥ కాంతారత్నము లిట్లుసల్పఁగరుమా ♦ కంజాక్షితాసిట్లనుఁ
గాంతారత్నములంగనుంగొని రహిం ♦ గారంపుహాస్యోసౌయుం
గాంతామోదఁపునెత్తపుంబలకవే ♦ గందెందుపొండాదటీ
కాంతారమ్మునఁబ్రొద్దుఁబుత్తమనన ♦ క్కాంతామణుల్ వాసిఁదేఁ

సీ॥ గవిసెనసడలించి • కలికికై నిడినక
డానివీణెయుఁ గేలఁ • బూనిపైఁడి
బొంగరంపుఁగవ • బోనిగుబ్బలఁగుబ్బ
కాయలఁగదియించి • కడఁకఁదీవె
పదుపుజక్కనొక్కనర్చి • పఱువంపునెఱిగోళ్ళ
సుతిఁగొల్పినాలాప • గతిఁదనర్చి
సరిగమపధనిస • సారములొలయసెలు
గించుకెత్తిపలుకు • సంచునరవ
తే॥ బలుకఁబలుకుఁదేనియల్ • జలుకఁగలికి
కోయిలలుబల్కుగతినెఱిఁ • గొమ్మవాఁడెఁ
మ్రోళ్ళననలెత్తనీళ్ళుమ్మొ • గిళ్ళహత్త
నోలినంచలుపరగఁజ • ట్రాలుకరగె॥ 126

సీ॥ ఇట్లుబాడుచుఁగొంద • ఱేణీదృశలతోడఁ
బంగారుపలకపైఁ • బరచిసారె
"లెత్తినచోనెవ్వ • రేనష్టమైనను
బంటకాఁ నిజం • పంగవలయు
సూ నాయమూరయు • చోమధ్యవర్తులే
మాటాడవలెనొడ్లు • మాటలాడఁ
దగ" దనిచాటించి • తరుణి!పందెమువేయు
మనిపురికొల్పిత • ప్పాడఁగినిస్కి
తే॥ సారెకెఱుగించుచంతంత • సారసాక్షి
నాగుమనితానుసారెల • నలవరించి
ఒరులుగెలిచినచోఁద్రుళ్ళ • కుంచుఁడంచుఁ
బందెమునువేసెఁదారుని • పట్టిపట్టి॥ 127

క॥ దుగదిగయు దిగయుదుగయుం
దిగతిగయుందచ్చినతయుఁ • దీవంచేని

త్రిగలాదిగాఁగ గతితకుఁ
దగఁబాదెములు వడెమదినిఁ • దలఁచిన కరణిన్ ॥ 128

కం॥ అన్నిటిఁ బంచఁగ నిండీ
రన్నిఁటిఁ బంచిన వెనుకను • నాఁడుఁడనుచు నా
కన్నియలఁ గెలిచె దారుని
కన్నియక న్నాకుమిన్న • గానాడియహో! ॥ 129

ఉ॥ చిత్తఱిము త్తెలుంగుసర • వింగర కౌశలమారనాఁడెఁదా
న త్తఱిచి త్తమందురహో • నందఱునందరుదందఁగాణలుం
ద త్తఱిలంగ డెందములఁ • దండిగ హాయినిఁ గొల్పుపాటచే
న త్తఱినర్కజుండు గడు • హాయినిఁ గాంచెఁ బలాళితోఁ సహా! ॥ 130

సుగ్రీవుఁడు రుమాదేవి పాటవిని చెలికానితోఁ ముచ్చటించుట.

చ॥ పారినమృతంపుఁ జోనలకుఁ • బొందును వీనులవిందుఁ బూవుఁద్రి
మ్మరి తెవకమ్మ మ్రోతలకుఁ • మవ్వఁపుఁ గోయిలకూతకుం బొరిం
బొరిఁ గనఁ గ్రందునైన స్వన • ముఃవిని బ్రహ్మముఁ గన్నవానితో
సరిగమునమ్మునందిరవి • జాతుఁడు వల్కను నేస్తకానితోన్ ॥

ఉ॥ మ్రోఁతయొకండు బిక్కటిలె • మ్రోఁలనువింటివె మేటితేటిరా
మ్రోఁతయొ వేల్పుటాండ్రెలుఁగు • మ్రోఁతయొ కిన్నరకన్య వెల్గుమేల్
మ్రోతయొ గండుఁగోయిలల • మ్రోతయొ మాట మిటారిపీసౌబల్
మ్రోఁతయొ నావయస్య! కర • ముంబరమామృతమయ్యెడుం బళీ!

ఉ॥ నావుడు "వాలితమ్మునకుఁ" • నర్మసఖుండను దేవ! వల్లకీ
రావము పొల్కెనేక్షితివ • రప్రియకన్యకయో వనమ్మునం
గ్రావములుం గరంగ మధు • రమ్ముగఁ బాడెను షడ్జశయ్యకా
కేవఁముదమ్మునం బ్రమద • కేకిగణం బెలుఁగిచ్చె వింటివే ॥ 133

చ॥ అనవిని వేడ్కఁ బల్కెను న • హస్కరనందను డావయస్యుతోఁ
బనివిని నీవుతత్క్రియముఁ • బాగుగ నారసి వచ్చితేని నే
బనివిని కాంతుఁ దత్తరుణి • బ్రాయపుఁ డెక్కన నాతడంతఁ వే
చనిచని పూపొదల్ దరుల • జిక్కనుకానుకచోట నీటుమై ॥ 134

ఉ॥ ఒక్కరసాలసాలమున •కోరఁశరీరముఁగుంచిపొంచి తాఁ
జక్కఁగఁగాంచెఁ జక్రసదృ • శ స్తనిఁజారుసరోజలోచనం
జక్కెరవింటిజోదనుఁగుఁ • జక్కెరబొమ్మయొడల్ పొలాయ్యఁగడుం
జక్కఁగఁగన్నదానిఁగను • చక్కనిదానిని మోహనాంగినిన్ ॥ 135

నర్మసఖుండు రుమాదేవిచక్కఁదనంబుసుగ్రీవున కెఱిఁగించుట.

చ॥ కనివినిదానిపోయఁగవు • గల్మినిఁబాట యొయారమాటలోఁ
గనివినితప్పఁగన్వొరవు • గంటికినింపగు డబ్బురంబుతోఁ
బనివినిరాజుఁదెచ్చి యిటఁ • బైఁదలికిందగులమ్మునర్తనం
చనివినుపూవుటమ్ముజోటి • కయ్యదితెల్పఁగనేగె నాతఁడున్ ॥ 136

మ॥ చనిసుగ్రీవునిఁగాంచిదేవ! పెనుకా • సారావళుల్ నాక జ
క్కని పూదేనియకాల్వలంచనక జో • క్కంపుంబొదల్ నాక జి
క్కని క్రొమ్మావులునాక వేచనిపొడం • గంటింగురంగాక్షిఁ బ్ర
క్కనిలింపాంగనలోయనం జెలులు జ • క్కంగొల్వవీణాంగరం
బనివార్యంబుగ మీటుచాటగొన జే • పారఁగఁజూపన్ను వన్ ॥

క॥ నరవరకన్యలనలకి న్నరవరకన్యలబలారి • నారులదర్వీ
కరవరకన్యలనలఘే చరవరకన్యలఁగలారె • సకిఁబోలుసకుల్ ॥ 138

చ॥ మృదుగతిఁ గ్రొమ్మొలుంగుజగిఁ • మేటిజమేటిసటుంబసందునాఁ
మెదిపి ప్రతాపఁపున్ శిఖిని • మెట్టి బుట్టుంబును దమ్మిదిమ్మనాఁ
జదరఁపుఁదాకటం దిటవు • సమ్మెటఁగెమ్మి మరుండున్నతో
నదిరిచి నేర్పుమైఁగలికిఁ • సృష్టియొనర్పఁగఁబోలుఁబోసఖా! ॥ 139

తే॥ మొగము సర్వమ్మసునేత్ర • యుగముపేరు
ఘురముసర్వమ్ము నవపయో • ధరములసదా
గవునుసర్వమ్ముగ గనమ్ము • నవునవంగ
నబలసొబగువశవమ్మునె •యభినుతింప 140

సీ॥ చిప్పురులు మటీపాప్లు • జిన్నితా బేళ్ళు జు
క్కలు దుతారలు ననం • టులును నిసుము

తిన్నెలు నల్లత్రాచుఁ • దిట్టలు సుళ్ళుద
రగలు బంగరుబొంగ • రాలు జంద
మలతూండ్లు బెసరగా • యలు దాటిగింజయుఁ
దొండపండులు జిల్క • తుటుముమల్లె
మొగ్గలు నూనసల్ • ముత్తెంపుజిప్పలు
విండ్లు శ్రీలద్దాలు • విరిదిరుగుడు॥
తే॥ బాఱు లఱనెల నీలంపుఁ • బాఱులుదోఁటు
దనఁపుఁగ్రొంకాఱుగఱిసిరు • ద్రావుడులు నె
లంతయంగకములకింత • కాంతినొసఁగ
లేకపోనిదానికి నొడల్ • జిగినొసంగు॥ 141

సీ॥ ఇంద్రనాగమ్ము నా • గేంద్రమ్ముఁనిందించుఁ
గతిమెప్పు కప్పునూ • గారుచొప్పు
నబ్జరాజివిరాజితా • బ్జమ్ముఁ హసియించుఁ
గందోయిపెంపు మొ • గమ్ముసొంపు
కీరవాణినివాణి • కీరమ్మునెగ్గించుఁ
గుల్కుఁబల్కులతీరు • గొమ్మసారు
మృగరాజమునురాజ • మృగమునునదలించుఁ
గవునుమేల్తళ్కు బ్రే • తుఁణఁపుఁబెళ్కు।
తే॥ జక్రతుల్యతఁబరగును • చంబులందుఁ
ద్భల్యచక్రతబరగునె • త్తుంబిఱుందు
నమరనారోహణావరో • హణములందుఁ
జానసాబగెన్నఁగునయ్యా • జగమునందు॥ 142

క॥ చక్రములునితంబాబులుచక్రములుపయోజగంధి • చారుకుచంబుల్
చక్రయుగమ్ములుకరములు చక్రధరునకైనఁదాని•శక్యమె పొగడన్॥
ఉ॥ తామరవిందుకందర! కను • దామరలుండుటకుర్ ఫలంబుగా
దామరకంటిఁగంటిఁదగు • దామరకంటియుఁనీవుఁ నీవునా

తామరకంటికిందగుదు • తామరకంటిని నిన్నుఁ గూర్పనా
తామరకంటివానిదిక • దామర యేమనిపల్కుదుం బళీ! ॥ 144

చ॥ అనవినిమిత్రపుత్రుఁ డెద • నంత మెఱుంగని యుబ్బు మోహముం
గని వనితామణింగనులఁ • గన్గొనను వ్రీళులూరుచున్ రయం
బునఁ దనపొందు కానిఁ దెరు • వుఁగనిపింపుమటంచు నాతడ
వ్వనిఁ దనముందుఁ ద్రోవను జ • వమ్మునఁ గన్బరుపంగఁ దాఁ జనెన్ ॥

శా॥ పూవుం దేనియకాల్వలీయవియ పూ • వుందీవెపందిళ్ళఁ గ్రొం
బూవుం జప్పరఁ పుల్ బిడారులివి యా • పుప్పొళ్లఁ జవ్వాజి నె
త్తావుల్ గుప్పివి కస్తురియ్యదిటుబోఁ • దాకల్ గడున్మెండు నీ
క్రోవల్ కావల మల్లెపూఁబొదదరిం • ద్రోవొండుగల్దట్టు వ్రేన్ ॥

చ। సుఖపుఁగనేఁగవచ్చు నల • సుందరి కేళి విహార వేళలం
గిలుకు ఋలుంగునంబలుకఁ • గెవ్వనె నార్చుచు వచ్చుకో వెలల్
చిలుకలతావు మావులవె • చేడియ పూఁబొదరిల్లునల్లదే
చెలువపుటన్నుమన్కియిదె • చెప్పెడి దేమదె పూవుఁబోఁడియున్ ॥

సుగ్రీవుఁడు నర్మసఖునితోఁ వచ్చి రుమఁ గాంచుట

చ॥ అసిచను వొప్పఁ నర్మసఖు • డాడుటకున్నను కల్కిమన్కిపై
నుసిచిన పైడిపంటికవ • యున్ మణిరత్నపుఁ దోరణాద్యులుం
గని చినరాయఁ డాత్మనిది • కాదగు మంగళ సూచకంబటం
చనిచనునవ్వలన్ ఘనులు • నారయుచుంద్రుసులక్షణమ్ములన్ ॥ 148

వ. అంతఁ దదీయమార్గంబున నేతెంచుచుఁ నర్మసఖుండు, రాజసుందరు
లున్నయెడ, కథిపులే తేరఁ వారు నాటి తేజీన ప్రౌఢలుఁగాని కతమ్మున
జంకుదురేను శంక నంకించి పలుకుటయుఁ సుగ్రీవుఁడక్కంబుగ్రీవల
కుఁ గనుచాటుగఁ గుఱంగట నొక్కచక్కనిపోకఁ బ్రమాకున కోర
గాఁ • జెలికాని కేలూని హాయలుమీరఁగాఁ బొంచి నిలుచుండి

సీ॥ పట్టుపైకఁ బగిల్చి • పైడివల్వ్యనదల్చి
మెఱుగు గుబ్బలడంబు • మిట్టిపడఁగఁ

బావహాఁమించి బైఁ • బన్ను చేలంబొంచి
పరువంపుఁదొడలడాల్ • బైటపడఁగఁ
జవిచక్కిలాల్ తూరి • చెక్కుటద్దాల్ మీరి
పైసికమ్మలతళ్కు • బయ్యలిడఁగఁ
దలకట్టు నెడబాసి • మొలపట్టుఁబడఁద్రోసి
పెన్నెఱుల్ పిఱుఁదులఁ • బేఱమిడఁగఁ॥
తే॥ గాఁగరాకుచ్చెలల్ కాళ్లఁ • గంతులిడఁగ
నెలుఁగుకిన్నెరపాటలోఁ • నిమిసిమడఁగ
మెలఁతగమిలోనఁ గిన్నెరఁ • మీటుచుడుగ
కాత్మకింపగురుమఁగన్నె • నతఁడుగడుగ॥ 150

రుమాదేవి సుగ్రీవుఁజూచుట

తే॥ అంతఁశశికాంతవేదికా • భ్యంతరమున
నంతమెఱుఁగని కౌతుక • స్వాంతలైన
కాంతలంగూడి యూరువూ • కాంతవెడ్కఁ
దంత్రిఁగొనగోటమీటుచఁ • వింతతోఁష॥ 151

సీ॥ ఎలజవ్వనమువాని • నెలచందు వలకందు
దలపందుఁబెగడు నం • దంబువానిఁ
జఱునవ్వులరువానిఁ • జెందమ్ము లందమ్ము
లందొమ్మిఁగొనుకన్ను • లంగలానిఁ
బరువమ్ముఁగలవానిఁ • బంగారు రంగారు
కంగారు చేలఁమై • గప్పువానిఁ
విలునమ్ములుగలానిఁ • విప్పారు నొప్పారు
గొప్పపేరురముతో • నొప్పువానిఁ॥
తే॥ వలపుఁగస్తురినామమ్ము • పొలుపువానిఁ
బిన్నవయసుంజెలులవల • పించువానిఁ
గూర్మిబుత్తువిరజాసన్గుఁ • గుత్తువాని
గాంచెఁ గనులారఁజెలినూతఁ • గన్నవాని 152

ఉ॥ చూచి భయాద్భుతమ్ములు వి • జృంభఁగ వెన్కకు ముందులాగఁగాఁ
లేచి స్వపాదపద్మయుగ • శ్రీమణినూపురరావ మొప్పఁగాఁ
ద్రోచి నెలంతలం గలికి • త్రోంగలి రెప్పలనోరగాంచుచుం
బూచిన యొక్క పోతనును • బోదియ మాటలనకేగె నంతలోఁ॥

సుగ్రీవునకుఁ రుమ చెలులు మర్యాదలు సేసి వారి రాకకుఁ

గారణమడుగుట

ఉ॥ నెచ్చెలి పింఛుసిందుకొని • నెచ్చెలితోఁ జనుదెంచినట్టి యా
పచ్చ గుర్రాలరాయనకుఁగు • బట్టికి ల్రమొక్క సభ క్తిగూర్చునం
బచ్చలగద్దె బెట్టి చెలిఁ • బ్రక్కనఁ గూర్చొనఁ జేసి దప్పికల్
బుచ్చ ననంటిదొన్నెయలఁ • బువ్వులదేనియలిచ్చి మెచ్చుగాఁ॥

ఉ॥ తీయని పంటుజక్కెరకుఁ • దీయని వానిని దెచ్చి ప్రచ్చి కొం
డయని వేడ్కనిచ్చితిసు • డీయనఁ వారలు వానిఁ మెక్కి యా
తీయని తేనె దావి వెను • దీయని ప్రేమలనుండఁ గాంచి రం
డీయని జోంట్లఁ బిల్చి విను • డయ్య సియోర్తు కవల్కు వారితోఁ॥ 155

ఉ॥ ఎక్కడివారలో తమరు • నింపుని గిందుని నెన్ను నీఘనుం
డెక్కడి వాడొ మీరిటకు • నెక్కడినుండియు వచ్చినారొ మా
కక్కడి వారికిం దెలియ • నింపుగఁ బల్కు డటన్నఁ వేడ్కమై
నక్కడివారి జూంక్షులకు • నర్కజు నెచ్చెలి పల్కెఁ నేర్పునన్॥ 156

క॥ అజనందనుఁడగు ఋషివి
రజనందనులఁ గడవాఁడ • రణ్యమునఁ గిరా
టజనమ్ముతోడఁ జని మో
దజనకముగఁ వేటఁ జలిపి • తాసిటు వచ్చెన్॥ 157

క॥ వచ్చి త్వదీయోద్యానముఁ జొచ్చి చరింపుచుఁ వనమ్ము • సొంపర్మిలిలో
హెచ్చుగఁ గన్గొనుచు ముని వచ్చని గుర్రాల్ వజీరు • పట్టియు నెంతేఁ॥

తే॥ పద్మినీజాతిభామలఁ • బాళిఁ గాంచు
నాతఁ డాటమీ పద్మినీ • జాతినాతి

గాంచవచ్చెనీకంజాక్షి • గన్న జేని
పేరు నీమెపేరుంబల్కు • డీరుదమిని॥ 159

ఉత్సాహము. నావుడిట్లువల్కుఁబద్మ • నయన మిత్రపుత్ర సు
గ్రీవునేస్తకానిఁగూర్చి • ప్రీతిపూర్వకమ్ముగాఁ
దేవ! శంభరీసమాఖ్యఁ • దేజరిల్లునీటుమై
శ్రీవరాంగికిల్లనంగఁ • జెల్లుపురవరంబిటన్॥ 160

ఉత్సాహము తారుఁడనుమహీవరుండు • దానినేలు నామహా
దారుఁడలరఁగాంచెనీ సు • ధాకరాననన్మహా
తారకేశకీర్తిరిపు వి • దారణుండు వార్ధిగం
భీరుఁడకలుషుండు నిండు • బేర్మిమీరనెంతయున్॥ 161

వ॥ అనియిట్లు సుగ్రీవునుద్దేశించి 162

ఉ॥ నేఁడుగదాలభించెఁ దరు • ణీమదనా! మిముఁగాంచుభాగ్యముల్
నేఁడుగదా సుధీవినుత! • నీవిటరాఁసమకూడెనన్నియున్
నేఁడుగదానశించెనెఱి • నీనునుజూడ్కులను త్తమచ్ఛటల్
నేఁడుగదామదీయ తరు • ణీమశికోర్కిఫలించెమేల్ భళీ!॥ 163

సీ॥ మృగవిలోచనరుమా • వృత్తాంతమీరీతిఁ
వినుపింపఁరవిజుండు • వేడ్కగాంచె
నావెన్కమదనుండు • నలరుటమ్ములఁరుమా
సుగ్రీవులమనమ్ము • స్రుక్కఁజేసె
నాపైనిసుగ్రీవు • నాలోకనమురుమ
పైనామెచూపఱ్కి • పైఁజెలంగ
నామీదనాయిర్వు • గాత్మలమోహంపుఁ
వెల్లిపొల్వెల్లినాఁ • విరివిబొంగ
తే॥ నంతలోఁశంభరిపురీశు • కాంతబిల్చెఁ
గాంత! రారమ్మటంచొక్క • కాంతచీరఁ
స్వాంతముప్పొంగనారుమా • కాంత వ్రామెఁ
దల్లికడకును సుదతీమ • తల్లికడకు॥ 164

చెలులు సుగ్రీవునాజ్ఞఁ గైకొని తమదేవితో నింటి కేగుట.

చ॥ ఇటు చెలి ప్రొవ్వుచుండఁ దరు • ణీ! కరుణానిధి యర్కసూతి ప
ల్కిటు చెలువారఁ గైకొనక • యేచనఁ జెల్లునయంచుఁ నెచ్చెలుల్
తటుకునఁ గాంతఁ జిల్పి నృప • తల్లజ! మా చెలి మీఁది ప్రేమఁ మీ
పటుతర మానసాజ్జమునఁ • బాయక నిల్పుమటంచుఁ యామినీ
విటుసమవక్త్రిఁ గొంచుఁ గడు • వేడుకతోడను బోయిరాదటన్

ఉ॥ కాంతనివాసభూములను • గన్గొనుచున్ ఘనమోహవార్ధిలో
నెంతయుఁ దేలుచున్ సచివు • డేగెడఁ దోడుగఁ గూడ రాగఁ గ
ర్ణాంతవిలోలలోచనకు • నైయటు దేపకుఁ జూచుచున్ వివ
స్వంతుకుమారుఁ డేగెఁ నిజ • పట్టణమార్గమునం బురమ్ముకై ॥ 166

పంచచామరము రుమాకుమారివో వృచెట్లు • ప్రొద్దుపట్టికయ్యెఁ నా
త్మమాటిమాటికిన్ విరాళి • ధైర్యమెల్లఁ జాఱిన
కుమారరూపరేఖయాత్మ • కున్ముదమ్ముఁ గొల్పనా
హిమాంశువక్త్రి వెన్కఁ చూచు • చిమ్ముఁ జేరె నంతలోన్

సూర్యాస్తమయవర్ణనము.

క॥ తనయునికి కేగెఁ నెచ్చెలి తనయునికినుకఁ విరహాబ్ధిఁ • దాఁ ద్రోసియు దే
యనికినుక సూనెనోయనఁ దినమాణిక్యముకషాయ • దీక్షితిఁ గాంచెన్ ॥

తే॥ వరుణదిక్కామినీమణి • వంట సేయఁ
వార్ధికూపమ్ములో నీటి • నర్ధిఁ దీయఁ
సాంధ్యరాగరజ్జువుఁ గట్టి • జాఱవిడిన
హాన్ను బిందెనాఁ వార్ధిఁ సూ • ర్యుండు గ్రుంకె ॥ 169

తే॥ మదనుని ప్రతాపశిఖిశిఖా • మండలంబొ
నన్నరమాదేవి కెంపుదు • వ్వలువడంబొ
మునికులఁ పురక్తశాటీస • ముదయకాంతిఁ
మోయునఁగఁ సాంధ్యరాగంబు • నొప్పియుండెడి॥ 170

క॥ మందోష్ణతఁ గనెదమ్ములఁ విందుం గలుఁగొరలు పక్షి • వితతులు గగన
మ్మందుఁ బఱతెంచెఁ నిద్దుర జెందెం దమ్మి మృగతృష్ణ • జీర్ణంబయ్యెన్ ॥

తమశ్ఛటాభివర్ణనము.

సీ॥ నల్లఁ ద్రాచుం బేర్ల • నుల్లసిల్లెడు శంభు
గప్పుఁ గుత్తుక సొంపుఁ • గాంచి పోరి
కమ్మని కస్తూరిఁ • నెమ్మె ననలందిన
మాయబోయత మేని • చాయఁ గేరి
నెమ్మి పించమ్ములఁ • నెమ్మిఁ మైఁ దాల్చిన
మాధవు తనుకాంతి • మహిమఁ దూరి
కమలనాభుని భుజా • గ్రమునఁ దాండవమాడు
భూకాంత నెమ్మిని • పోలుపుఁ మీఱి
తే॥ కలిత కాదంబ కాళింది • గరిమఁ దీటి
నవతమాలావృతాంజన • నగముఁ గీటి
రోదసీగహ్వరమునఁ జే • ర్కొనియెఁ మేటి
కటికిచీకటిమత్తేభ • ఘటలు ధాటి॥ 172

తారకావళీవర్ణనము.

తే॥ గీ॥ భర్త వచ్చునటంచుఁ రే • బడఁతి కోర్కెఁ
బూసి తోడి కట్టిన కడాని • పుట్టముపయి
వోడిపూలనఁ జుక్కల • పిండు దోఁచెఁ
దత్సితప్రభ యనఁ బ్రాచి • ధవళమయ్యె॥ 173

చంద్రోదయవర్ణనము.

తే॥ గీ॥ పూర్వదిగ్భామినీవక్త్రి • పుండరీక
మోయనంగఁ సుధాకరుఁ • డుదయమయ్యె
నమ్ముదిత మృగమద తిల • కమ్మనంగఁ
లలితకాంతిఁ జెలంగెఁగ • ళంకరేఖ॥ 174

ఉ॥ అప్పుడు పుష్కరస్థలి మహాత్తరభంగల సత్పయోధిగా
నొప్పుడు ఫేనతారకలు • నుక్కటగ్రాలుడు శేషశయ్యనా
నొప్పుడునోషధీశుఁడు ఘ • నోద్ధతిఁ తోఁడఁ రమాధవుండు నా
జొప్పుడుచుండెనానడిమి • చుక్క యునల్లఁ గజూపఁ రెన్నఁగన్॥ 175

క॥ అనినే స్తకత్తెతోఁ నెమ్మనిట్టాడి మిట్టారివాడి • మెఱుఁగుటలుగులం
గనికరమఱపఱపెడుమారుని నిందింపంగఁదొడఁగెఁ • రూక్షోక్తులతోన్॥

### మన్మథదూషణము.

ఉ॥ పుట్టితివాదిదంపతుల • బొజ్జనుశక్తినిముత్తెపుంబలెం
బట్టితివాభవాది సుర • వర్యులనేనిఁగలంచుకైదు వుం
గట్టితివౌజయధ్వజమ • ఖండవిరాగులఁ గెల్వఁగా నిలం
జుట్టితివౌదిశాకరుల • శుద్ధరదాళియశోభిసంబులన్ ॥182॥
క॥ ఇటువంటివాఁడవయినీ వెటువంటిఘనంపుఁగార్య • మిదియంచునిశా
విటువంటిమోముగలసకి విటువంటివెతంగుఁజేసితి • వించువిలుదొరా
శా॥ తోడంబుట్టినదానిగేహపదవిం • దోడంబోరింగొన్నఁ జేం
తోడంబుట్టినదాదిగాఁ మెలఁగు నీ • తోడంబోరిన్నిగ్గగుం
దోడంబుట్టినదానిగాభ్రమనఁదో • త్రోనయ్యయో!యబ్బగాఁ
దోడంబుట్టినదానికన్నఁ మెలగం • దుర్మార్గచేష్టల్ ధరన్ ॥184॥
క॥ ఓతలరాయఁడ! ద్రుహిణుఁడు నీవలనంజరుగువిరహి • ణీవధగనికా
యావలను"మార"నామముఁ దావలనుగఁ బెట్టెఁ జెల్ల • దానీకదియున్॥

### చంద్రదూషణము.

వ॥ అని గోవిందనందను నందందమందలించి విన్నందునం దొగవిందు
క్రందునంగా యుఁ రేయొండె వేడిమింబోడిమిఁ జెడి తత్ప్రపనకోపం
బున నాతుపాకరుఁ గేలంజూపుచు నేపున నిట్లనియె.
క॥ ఓచంద్ర!"రాజ"నామము • నేచతురాస్యుడిడెవిరహి ణీసంహారణాం
బేచతురంతయనునీకహా హా! • చతురతగురునివద్ద నద్దిచదివితో ॥187
క॥ రాతిరిదిరుగుటచేడల • నేతఱినేచుటసిరిచెలి • కెగ్గించుటచే
ధాత"నిశాచర"నామము • దైతేయులకుబలెనీకు • దానిడఁదగు రా: 188
క॥ కొందఱికి మఱియనిరి వెఱినందఱిమాటమన కేలయందు విరహులన్
ద్రమందింపఁదద్దురితమిటుపొందినదంచువినుఁగందుపొలువున నెంతే 189

### దక్షిణానిలాదులదూషణము.

క॥ బాలామణియాలాగునఁ బాలానిలశుకపికాళి • పాళికడిమిమై
బాలార్కుఁ గ్రమముగా బరి • శీలనముగఁ వానినింద • సేయగదొడఁగెన్

సీ॥ తక్షకాద్యహిరాజ • భక్షణీయుఁడవైన
దక్షిణానిల! యేల • తగనిపాటు
కొమ్మపల్కులు నేర్చి • కొమ్మఁద్రిమ్మరివైన
కొదమచిల్క! యేల • యదరిపాటు
నోడ్లపంచలఁ జేరి • యొడ్లు బెంచఁగవైన
గండుఁగోయిల! యేల • మండిపాటు
నిమ్మలఁగనకగం • ధమ్ములఁగలనైన
నెరుగనియళి! యేల • యెగిరిపాటు
తే॥ పంచబాణునిరథ • హయబలగుణముల
మంచుఁబొంగకుఁడీమీరు • నట్టులైన
త్ర్యంబకుఁడుపాసనాదైన • మగుటనాకు
మీరుమీరాజుననుఁ గెల్వ • లేరుసుమ్మి 191

వ॥ అనిమందసమీరకుమారుఁ దూరి చిలుకలనలుక గొలుకబలికి వనప్రియమ్ముల నప్రియమ్ములాడి మదాళిపాళిదూలించినవిని రుమాకు మారికామణి కామె చెలియిట్లనియె. 192

చెలికత్తెలుతమతమదేవితోఁ సుగ్రీవుఁడు విరాళిఁ బ్రుంగియుండెనని
విన్నవించుచునూరార్చుట.

సీ॥ వినుమురుమాసతి! • వినుకెంపుకొమరుండు
నీదండబాసినీ • పైదమినిను
నెదదలంపు హదమ • యిమ్మనకుంబోయి
ఘనవిరహాగ్నిలో • గాఁగిఁ గ్రాగి
నేస్తకాఫంగూడి • నెజేఁబూవుదోటకై
చనియొక్కయెలమావి • చక్కఁజేరి
యచ్చోటవిహరింపు • చెచ్చటగనుఁగొన్న
బచ్చువిల్తునిసేన • పెచ్చురేగ

ఆ॥ వె॥ వానిదాడికచట • దానిలువఁగలేక
మనికికేఁగనచటఁ • మయిషిష్ఫుల
గ్రుమ్మఁ "ముల్లుపుచ్చి • కొట్టడచిన"చంద
మయిన నిన్నుఁగూర్మి • నాత్మఁదలఁచి 193

ఉ॥ పాయకుఁబల్కకేఁగెవెఱ • పాయనుబాళిని గాంచకుంకుటిం
పాయనుఁబల్కవింతమఱ • పాయను నగ్గరుణాబ్ధిఁదేల్చు తె
ప్పాయనుమేరమీరుటాఱ • పాయను నారతనాలమేలి కు
ప్పాయనుమేలుఁగూర్పమిఁక • పాయనుపాయుట నేరుపాయకుఁ॥

చ॥ పడతిరో! పిల్వ కేఁగవెఱ • పామరపాపపారపాటవేదనా
జడధి నిటాచిత్రోఁచ నలు • చాపెలుచాళులుచాయఁగూర్మిలోఁ
మడఁచి దడాల్నఁబోసమయు • మానయమూ దయమాలి వేదనం
గడపుము నాకుఁద్రోడవుము • కావుముకావుముకావుమర్మిలిఁ॥ 195

మ॥ అనిత్వత్కళికకంబు ఘాత్మరమణీ • హస్తాబ్జకీరమ్ముఁగూ
ర్మినిజూడం జనివచ్చుచోఁదెరువున • న్మేలంచుఁ గిష్కింధలోఁ
మనికిన్మారుసిఘాకకోర్వకడలం • బాటించి నానంచుబా
ళినినాతోననెవాఁడు నీవలెవిరా • ళింబ్రుంగుచుంజెంజెలి! 196

క॥ కావుసనతనికినియెడఁ భావముకఁదంచునేను • బలికెదనతఁడుఁ
నీవుండుచోటకిసిరహిఁ రావలెననియుంకుననట్లు • రాజని చెలీ! 197

క॥ సీతంద్రికిఁజెప్పిదయా స్వాతుండతఁడుజెవిఁబెట్ట • వేమరువానిఁ
బ్రీతిఁబిలిపించికార్యముఁ జేతికినందంగనేన • చేయుదుసుమ్మా!

ఉ॥ ఇట్టనికేలమ్మోముఁబను • కెత్తికురుల్కడకొత్తిపేర్లుజఁ
మిట్టలఁజక్కహత్తి నెటి • మేసిరిగండముఁమెత్తివీనులం
బిట్టుగఁగ్రమెత్తి కను • బూలహిమాంబులవిత్తినాడుఁ
గట్టుగ? యొచ్చుకొమ్మనుచు • నాతుకయక్కనొత్తి తేర్చఁగఁ॥

## ప్రభాతకాలవర్ణనము.

క॥ ఇక్కరణినుండఁగోడలిఁ
జక్కరిహింగోమరుఁగూర్పఁ • జనుదెంచెదనం

చక్కర్మసాక్షివంపఁద
ఁటుక్కనవచ్చునసిఖరభ ◆ టుండో నాఁగ౯॥ 200

వ. ఆఖండలదిగ్వేదండయానమణి కుండలంబోయనఁ దూర్పుగొండఁజు
క్కపొటుక్కునంబొడుచుటయు

చ॥ కొలఁకులఁ బ్రమోసెఁ దుమ్మెదలు ◆ కొక్కొరొకోయనికూసెఁ గోళ్లుది
క్కులకొగిఁడాసెఁ జీకటులు ◆ కోకములార్తినిబాసె నెల్లం
క్కలఁజిగిమాసెఁ మన్మథుఁడు ◆ గార్ముకమెక్కుడుదీసె గల్వలి
క్కలఁవెతమేపెఁ దమ్మిచెలి ◆ కాంతునికైకొనుసేసె నెమ్మొయి౯

ఉ॥ అవ్వలఁ దూర్పుగొండపయి ◆ నంబుజమిత్రుఁడు గల్వతేఁడు దా
నివ్వలఁ గ్రుంకుమెట్టపయి ◆ నెంతయుఁ జూడఁగ నొప్పిరా! పవల్
జవ్వనితేఁడువచ్చునని ◆ చక్కఁగఁ గొప్పుఁ ఘటించిచూడఁగా
నవ్వలవివ్వల న్మెఱుఁగు ◆ టద్దములింపుగ నిల్పెనోయన౯ 203

చంద్రాస్తమయవర్ణనము.

తే గీ॥ కలువపూఁబోఁడిఁ గూడినీ ◆ తొలఁగు బావ
రాఁదలఁచెఁజమ్మటంచుఁద ◆ ద్రమణి కెఱుఁగఁ
బలికిస్నానమ్ముఁ శ్రమఁదీరఁ ◆ బశ్చిమాబ్ధిఁ
జల్పసేగినగతిఁ గ్రుంకెఁ ◆ జలధిఁ విధుఁడు 204

సూర్యోదయవర్ణనము.

తే గీ॥ ఓలిఁ సతపేరిపచ్చగు ◆ ట్టాలజతన
మర్చినరథంబుఁ దోడలేసి ◆ మల్లుఁడొకఁడు
దోడి తేనెక్కి హారిదోచెఁ ◆ దూర్పుఁగొండఁ
బ్రాగ్దిశాకాంతచేతిహా ◆ స్పంతినాఁగ 205

తారుఁడుకొమార్తె మనంబెఱిగి ఋతువిరజునకుఁ వాత౯
నునంపుట.

శా॥ అంతందారుఁడనుంగుబట్టిన్హృదయం ◆ బ్రాప్రౌఢచూల్పైనన
త్యంతంబుఁడుటనామకూర్మిచెఱిచే ◆ తర్కవించుఁగన్యామణీ

స్వాంతం బెట్టులొ యట్టు సల్పుటయకె • జణంబంచు దా నెంచుచుం
స్వాంతంబందున బాడితప్రతతి బి • ల్వంబంచి సంప్రీతిమైన్ ॥ 206

క॥ ఓ ప్రాజ్ఞులార! వినుడీ • నా ప్రార్థన ఋక్షవిరజు • నందనునకు నే
నీ ప్రాయము జెలిరుమనిషి, నా ప్రాక్తన దురితములన • ణంచికొని యెదన్

వ॥ అట్లు కావున 208

శా॥ శ్రీమంతమ్ముగ పీశ్వరాఖ్యమగుకి • ష్కింధాపురంబీరటం
ప్రేమం బోయి కపీంద్రు ఋక్షవిరజున్ • వీక్షించి కార్యంబొగిం
దామంతంత నెరుంగ జేసిరహినా • తండిట్టపడ్డన్వేఘన్
క్షేమంబొప్పు ముహూర్తణముం దెలిపిధి • చ్చేయుండు మీరంతటన్

పండితులు పెండ్లిరాయబారమ్మునకై ఋక్షవిరజునికడ
కేగుట.

వ॥ అని చెప్పి పుచ్చుటు వారలత్యంతాదరమ్మున గిష్కింధానగరమ్ము నకుంబోయి ఋక్షవిరజు కపిరాజరాజు గాంచి వారలంతకుమున్న భక్తిపూర్వకముగ నెదుర్కొని కొంపోయి కూర్చుండ గద్దియలిడి కుశలం బడిగి

చ॥ శతధృతినందనా! వినుము • శంభరిపట్టణ మేలుదారుడన్
దతధృతి నాదితన్మహిపు • నందనుడైన రుమాకుమారి నీ
సుతుడు పనర్క గోరినది • సుమ్మది కావున నాదు నీదు నీ
సుతునకుబుత్రి నీ దలచి • "సూడిదమమ్మిటగ న్వెనాఘర్షన్

సీ॥ ప్రాజ్ఞులారా! మాకు • నంతకంటెను శుభ
కార్యమొండున్నదె • కన్యసిత్తు
మం చెంచుబుత్తెంచిన • యాతారునకు దెల్పు డ
రుదెమ్మటన్న చో • నాత్మజు గొని
వత్తు మొంతే నన్న • వల్లెయంచనివారు
సుముహూర్తమెల్లుండి సౌరిదిమీరు
విచ్చేయుడని పల్కి • వెళ్లితారుం గాంచి
జరగినవృత్తాంత • సరణి దెల్పి

తే॥ వత్తురెల్లుండి పెండ్లికిఁ • వారలంచుఁ
బ్రాజ్ఞులెరిగించి వెళ్ళిన • రాజునంతఁ
బట్టణంబెల్లఁగై సేయఁ • బంచితగుప్ర
యత్నమునను౦డెనక్కడ • నలరివారు 212

ఋతువిరజుండు సుగ్రీవునివివాహంబునకుం దరలి
శంభరీపురికి వెళ్ళుట.

మ॥ మదినింతంతన రాని సంతసమునం • బ్రహ్మర్షిజుండార్యులం
బదిమందింగులవృద్ధబాంధవతతిం • బ్రార్థించి రప్పించి ప్రా
లిఁదినంబుంబలె నంతకంటెమును బా • లిన్నిరఁగై సేయఁ జే
సిదినేశాంశజుఁ వేడ్కఁబెండ్లికొమరుం • జేయంగఁము త్తైదువల్ ॥

ఉ॥ స్నాతకముంబొనర్చికొని • స్యందనసామజ ఘోటకాళిపై
నాతతబంధువర్గములు • నార్యులురాగఁసమస్తవాద్య సం
ఘాతఁప్రమోదలుందెసలు • గ్రమ్మఁసి తేభ రాజముం
బ్రీతయుఁదాను నెక్కి తన • ప్రక్కనుఁబ్రొద్దుటునుంగుగుల్జులుగా ॥

తే॥ కూడరాఁఋతువిరజుఁడు • గొమరుఁడైనఁ
లెప్పకుత్తుకవాని పెం • డ్లికినిజనియెఁ
గాణలెంతయునాడఁరో • కలుకులాడఁ
బ్రాహ్మణుల్ వేదమంతంతఁ • బలుఁకదోడ 215

క॥ ఈకరణినివాద్యార్భటిఁ లోకములద్రువంగఁవిబుధ • లోకమ్ములంతొఁ
జోగఁజనెశంభరికిఁసుగుణాకరుసతఁడర్కుఁడుదయ • మందకమున్నె ॥

తారుసిమంత్రులు ఋతువిరజాదులదోడ్తెచ్చి
విడిదిలోదించుట.

ఉ॥ అంతకుమున్నశంభరి పురాధిపుఁ • డంపఁగఁవచ్చి మంత్రుల
త్యంతకుతూహలమ్మునఁమ • హావిభవమ్మునఁగొంచుఁబోయి య
భ్యంతరమందిరంబునన • వారలఁడించిచనంబురోహితుం
డంతముహూర్తఁపుంగడియ • లాగమనంబగునంచుఁబల్కఁగా ॥

వ॥ పదంపడి విద్యాహాయగ్రీవుండునైన సుగ్రీవునకుఁ బుణ్యాంగనాజ

నంబులునలన మంగళస్నానంబు నిర్వర్తించి ప్రాంచితదుకూలాం
బరంబులఁగట్టించి సువర్ణమణిమయాంగదంబులఁ బెట్టించి కస్తూరీ
తిలకంబు నళికంబునఁదిద్దించి శ్రీచందనంబందంబుగ నొడలనలదించి
వెండిబెత్తంబులఁ ఝుళిపించి పట్టనభటచయంబు లోరలఁ బాగుదీర
భూసురాశీర్వాదనాదంబు బాగుమీర మంగళవాద్యార్భటులు
డంబుమీరఁ బెండ్లికొమారు సితగజారోహణంబుగావించి మోదించి
పురవీధివచ్చు నెడవరునకుఁ బురంధ్రీరత్నంబు లొసంగు కర్పూర
నీరాజనంబులందికొని వివాహమండపోపరి స్థలసితకనకకలశంబుల
నుపలక్షించి శుభలక్షణంబుగా నెంచి తదీయద్వారపార్శ్వంబుల
నూతనజామాత్రాహ్వానంబుంబొనర్చు వైవాహికమంటపలక్ష్మి
కరపల్లవంబు పోలుపుఁదెలుపుచు నానతంబులయి తోరణాంకురంభా
తరుపల్లవంబుల కోకకలఘుచు నంతంత నృత్యగీతాది వినోదంబుల
నిలకింపుచు బుక్కువిరజాజులే తేరనంత నక్కడ 218

మ॥ అలరుంబోండ్లురుమారుమారిజలకం • బాడించిసిరోజ స్త్రావే
షాలదూర్పె త్తికురుల్ ఘటించి నెఱికీ • లుంగరంబుహోన్నాగరా
మొలగట్టించిజిలుంగుపైకదాడిక్రొం • బొంజేలనొసీగజె
న్నలరంగారచియుంచిచెన్నగ తెగల్ • హత్తించికస్తూరికా
తిలకంబుంగనుసేయవచ్చెజెలివే • దీసీమకుఁ సిగ్గుతోఁ 219

వ॥ ఇట్లునేస్తకత్తియలుదోడ్కొని వారికియుదండలనూని రుమాదేవివచ్చి
న నిక్కడ తారుంను. 220

వైవాహికవర్ణనము.

ఉ॥ ముద్దులపెండ్లికొమ్మమును • మున్ను నెదుర్కొనివారు ముక్కు సం
గ్రద్దన బెండ్లికొమ్మవిక • గమ్మనిదీవెనలిచ్చిమాత్రులుం
దద్దయుగూడరాసకల • తాళిన్మృదంగరవంబులెల్లగా
బెద్దయుఁదోడితెచ్చినెజి • పెండ్లిలితిన్ని యనిల్పెనల్లునిన్ 221

మత్తకోకిల. ఇట్టిశేషవిశేషవాద్యము • లెల్లమోగ్గధనాంగనల
నెట్టకెధయయంచునాడన • నేకబాధువులెన్ను హారం

బట్టుపుట్టపుఁడోయిమేల్ మధు ♦ పర్కమిచ్చి సిరిన్నెఱిం
బట్టుపుట్టపుఁదారికిచ్చిన ♦ పాలసందు, నకీడుగాఁ
బట్టియారుమఁధ్వారవోసెను ♦ బాళిదారుడునర్కికిన్ 222

క॥ హాళినిజెందగవిందులుబాళినిబ్రాల్గంపనుండు ♦ పట్టికివరుచే
దాళినిగట్టించగఁదెరయోలినిదగ్గరకువంప ♦ నొగిదంపతులున్ 223

చ॥ ఒకరొకరింగనుంగొనెడు ♦ చో! వరుచూపుల్కలుకల్కి ముద్దునె
మ్మొకమునమోహానంపువల ♦ పుంగబరింజనుపూలబాతులం
బ్రకటతరోరురంభలను ♦ బర్వెదదీయవిలోకనాబ్ధిలో
జకచకనేగుచేపలన ♦ జానవిలోకనమిల్తగెంగనన్ 224

మత్తకోకిల. కట్టెనర్మిలిఁదాళివారిధిఁ ♦ గల్గుచిందఁపుఁగల్మినే
నట్టె కొంద్దగుకంఠసీమఁవ ♦ రాంగుళీయరుచుల్ గొనాల్
పెట్టెయారుమకంఠహారఁపుఁ ♦ బెంజగ్గాగిఁతోడఁదా
నట్టెయేకముకాఁగఁజోకన ♦ హాస్కరాత్మజుఁడెంతయేన్ ॥

చ॥ అడుగులుత్రొక్కులాడ నస ♦ దాకవునల్లలనాడఁముంగురుల్
ముడివడిమోముగూడ నెద ♦ ముత్తెఁపుజెత్తులుదూగియూడ న
ప్పుడుదమవారఁజూడఁ మిను ♦ పూప్రకొమారునిపైనిప్రీడ న
ప్పడతుకదోసిలెత్తితల ♦ బ్రాలనుబోసెనుజూపుచున్నెఱిన్॥ 226

మ॥ వలెవాటంసమునుండిజారఁసగులా ♦ పైఁరొమ్మునంబోరఁ గ
న్నులునందంబుగనెఱ్ఱవారఁముఖసిం ♦ ధూరమ్ముజాల్వారఁ బ్రోఁ
గులడాల్ జెక్కులగ్రేల్లువారఁనప్పని ♦ గ్గుల్ మోముపైఁజేరఁగాఁ
దలఁబ్రాల్ వోసెఁరుమాకుమారిపయిఁమా ♦ ర్తాండాత్మజుండర్మిలిన్

క॥ ఆజలజనయనపైట్టిన లాజలఁబ్రేవెలిచెనతఁడన ♦ లప్రీఁతిదమిన్
ధీజనముశమీశుష్కములోజననేకమ్మొనఁగి ♦ యొనరించుశిఖిన్ ॥

క॥ ముడివెట్టఁజెఱఁగులింతులు
ముడివెట్టెఁబడంతికన్ను ♦ బొమలనునారన్
ముడివెట్టెఁదేరినారిని
ముడివెట్టెజాలు మరుఁడు ♦ బూవింటరహిన్॥ 229

వ॥ మఱియు నాదంపతులు 230

శా॥ పేరంటాండ్రు ఘటించు కొంగుముడులం • బ్రేమమ్మునం దాల్చి క
న్యారంగాంచి యరుంధతీధ్రువులను • న్స్వాహాధినాథుఁ గనన్
స్వారంబర్మిలిఁ జల్పి పెద్దలొగిఁ మా • ర్కండేయునంతాయువో
ప్పారంబల్కు శుభాశీతంబులిడన • వ్వానిం దలందాల్చిరా!

తారుఁడు గూతున [illegible] కరణంబిచ్చిపుచ్చుట.

క॥ నాకబలితుదగఁ గ్రమముగ
నీకరశిగ నైదువినము • తెలమినడువఁగాఁ
లోకమెరుగంగఁజల్పి గు
ణాకరుఁడగు తారుఁడల్లు • నకుఁ సంప్రీతిన్ ॥ 232

క॥ అరదంబులులక్షమద
ద్విరదంబులుధద్విగుణము • దీప్తాశ్వములుం
ద్విరదంబులకుం ద్విగుణము
నరదంబులకుం ద్రిగుణము • నలభటులనిడెన్ ॥ 233

క॥ రత్నములఁ మఱియుఁగన్యా, రత్నములను వేయికనక • రజితములసతీ
రత్నములలరఁగఁగన్యా, రత్నమునకు నల్లునకున • రణమిడెఁ బేర్మిన్

క॥ మఱియుంగూతున,కల్లన కఱగొఱలేకుండఁసకల • మగువస్తువులన్
నెఱెనొసఁగి హొన్నుపట్టుం, జెఱఁగులదువ్వల్వలిచ్చెఁ • జెన్నలరారన్

క॥ విందులకుఁ శబరివిదురుల, విందులకుం జోడురాగఁ • వేడుక నెట్టెన్
విందులఁ దేజనఁదమ్ముల, విందులనంజాలుబుక్షు • విరజాదులకున్

వ॥ ఇట్లొసంగి జాంబూనదాంబరాభరణాదులిడి తారోర్వీతలేశుండు ముద్దుపట్టి నొద్దంజేర్చి యక్కునం జక్కనొక్కి ముద్దాడి చుబుకంబుఁ దువ్వుచు నిట్లనియె. 237

సీ॥ పెనిమిటిమదిఁగని • పెట్టిపోఁగదవమ్మ
యత్తమామలకెదు • రాడకమ్మ
యాఁడుఁబిడ్డలకడ • నణగిమెలఁగుమమ్మ
యేరాండ్రమొదఁదగ • వెరుగుమమ్మ

పిన్నపెద్దలనతి ♦ ప్రీతిఁజోఁగనుమమ్మ
దాసీలపైఁదయఁ ♦ దప్పకమ్మ
భర్తమిత్రులనతి ♦ భక్తిమైఁగనుమమ్మ
భర్తశత్రులకంటఁ ♦ బడకుమమ్మ
తే॥ పురమువారికెల్లఁ ♦ బూసలలోఁదార
మట్లుగృపకుఁబాత్ర ♦ మగుముకొమ్మ
మమ్మునెదనుదలఁపు ♦ మాయమ్మరవ్వయుఁ
రట్టులేకజోక ♦ బ్రతుకుమమ్మ 238

చ॥ ఎరుగవునట్టిగోలవిటు ♦ లేద్వఁగఁజెల్లునపిచ్చిదాన! నే
వొటిలిననామనంబడలు ♦ చున్నదినీదువియోగవారిధిం
దరమభరింపఁగీదయిన ♦ తమ్మునిఁబంపెదఁగాదకూడ స
త్వరముగనెల్లినేనయినఁ ♦ వచ్చెద"నమ్మగ"పొమ్మటంచుఁటః 239

క॥ ముద్దుంబెండ్లికొమార్తెను,
ముద్దుంబొడిలికొమారుఁ ♦ మొగిఁదారుఁజుదా
నిద్దఁపుటద్దఁపుఁబల్లకి
నిద్దరనిడిపుచ్చెఁవేడ్క ♦ నంతేవిభుతర్ 240

వ. ఇట్లు సబహుమానంబుగా నెల్లబందుగులంబుచ్చుచు వారలతివైభవంబునఁ గిష్కింధానగరంబునకు నరిగిరని పల్కుటయు తరువాతి వృత్తాంతంబు వినగోరుటయు 241

ద్వితీయాశ్వాసాంతపద్యములు.

క॥ స్తుతిజనకధర్మగుణశో, భిత!హరిపత్పద్మగంధ ♦ పీయూషరతా!
శ్రితజనసంరక్షితమ, త్కృతసత్కృతిసహితతతవి ♦ తీర్ణరవిసుతా!

భుజంగప్రయాతగర్భితస్రగ్విణి.

నిరదాభద్యుతీ! నిశ్చలోద్యద్ధృతీ! స్ఫారభాస్వన్మతీ! పాలితాస్మత్కృతీ!
ధీర! మారాకృతీ! దివ్యభాస్వత్కృతీ! సారలక్ష్మీభృతీ! చారుకీర్తీ!ధృతీ
(తుదిరెండువర్ణములు మొదలనిడిచదివినభుజంగప్రయాతవృత్తమగును)

ఆందోళికా బంధము.

క॥ ధీరవరగేయచిత్తా! ఘోరకలుషవేషభావగుణికృత్తా!శరత్
ధారాధరగోరధరా • ధారాజత్కుందకీర్తి•తత్పర!వరధీ! 245

మాలినీవృత్తము.

స్మరవిధునిభవేషా! సత్యభాషావిభూషా!
ధరణివిబుధపోషా! ధర్మకార్యాభిలాషా!
వరమతిజితశేషా! వందనీయార్యతోషా!
అరిబలవిజిగీషా! స్వాన్వయాంభోజపూషా! 246

గద్య

ఇది శ్రీమ"దచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్గద్య నృగచరిత్ర"కృతివిరచనాచాతు
రీధురంధర సద్యశోబంధుర కౌండిన్యగోత్ర కలితాపస్తంబసూత్ర
చతుర్విధకవితామతల్లి కాబ్జరాజాన్వయపయఃపారావార రాకా
కైరవమిత్ర నృసింహామాత్యపాత్ర మంగాంబా శేషా
చలామాత్యపుత్ర సుధీజనవిధేయ హనుమంత
రాయనామధేయ ప్రణీతంబైన శ్రీమత్సు
గ్రీవపట్టాభిషేకంబను మహాకావ్యంబు
నందు ద్వితీయాశ్వాసము.





శ్రీసీతారామాయనమః

# శ్రీమత్సుగ్రీవపట్టాభిషేకము.

## హనుమత్కవీయము.

## (తృతీయాశ్వాసము.)

క॥ శ్రీమత్కుశకులార్ణవ సోమ! వివేకాభిరామ! స్తుతిజనకగుణ
స్తోమ! మహాకావ్యసతీ కామ! పకీరయసనామ! ఖరకరధామా! 1

క॥ అటమీఁది తెఱఁగువినుఁడు త్కటకరుణంజంద్రధరుఁడుగాళికిక్షితిభృ
త్కటకమునసుడువుపముపున నటసూతుఁడుసెప్పెమునులకవలికతవినఁ-

ఋక్షవిరజుఁడెల్లఁరత్నో నిల్లుసేరుట.

వ॥ అట్లు ఋక్షవిరజుం డెల్లవారలతోడం బురంబుఁజేరి. 3

శా॥ శ్రీరాజించెకుకోడలింగొడుకు గూ • ర్మిన్మీరహాన్నల్లకీ
లోరాజించఁగనుంచి వాద్యరవళిఁ • లోకమ్ములట్టిట్టుగాఁ
నీరేజాక్షులు మేడలన్నిలచి యెం• తేలాజలంజల్లగా
నూరేగించి గృహప్రవేశమటనా • ర్యోక్తిన్నివర్తించినఁ॥ 4

ఋక్షవిరజుసభకుఁ బుత్రయుతుఁడై వాయువువచ్చుట.

ఉ॥ అంతటనొక్కనాఁడు ద్రుహి • ణాత్మజుఁడాత్మసభ న్వనాటుల
త్యంతముదంబునంగొలువ • నాత్మజులిర్వురు గోత్రభిద్రవ
స్వంతులరూపతేజముల • బంగరుగద్దెలఁగ్రాలఁగా సభా
భ్యంతరసీమకొక్కరుఁడు • వచ్చె గుమారకరగ్రహాధ్యుఁడై॥ 5

వ॥ ఇట్లు వచ్చిన 6

ఉత్సాహము. ఆశుగాఖ్యుఁడంచుఁ జూప • రాత్మలందలంప డ
త్త్యాశువేగమునవచ్చి • నట్టివాయుదేవున
త్యాశదోడితెచ్చియాస • నాదులిచ్చిభక్తినా
కాశనిల్చి కేలుమోడ్చి • యతనిగూర్చియిట్లనుఁ 7

క॥ పాలుజిలుకు చెక్కులజూన
పాలుబాజాలహారానుసాలు • పయిజందెముమో
కాలుందాకెమచక్కని
కేలుంగలముద్దుకుట్టు కేల్వట్టి • వెసఁ॥ 8

ఉ॥ ఎన్నఁడు రాసి పెద్దలిపు • డింటికివచ్చితి రేమిచెప్ప నా
పున్నెము "గువ్వగుంటపయి • బుష్కరవాహినివారె" నన్న మీ
రెన్నని టేలవచ్చితిరో • యీపసి బాలకుఁ డెవ్వఁడొక్కొ నా
కున్నెఱిదొల్కఁ బేర్కొనుము • కుంఠితరీతిఁ గురంగవాహనా!॥ 9

వ॥ అనిన పృషదశ్వుం డతనికిట్లనియె. 10

ఆ॥ నాకుఁ బుత్రుఁడితఁ • డేకాంఘ్రిరుద్రుండ
టంచుఁబల్క విందు • నార్యులద్ది
యట్టులుండనిమ్ము • సజ్జసంభవపుత్ర!
నీనిపుట్టువువిను • బేర్కొనెదను॥ 11

హనుమజ్జననము.

సీ॥ తనదైత్యకసకాద్రి • దానవారులకెల్ల
కోర్కిమై పెట్టని • కోటగాఁగ
దనకేసరిపమాఖ్య • దైత్యమత్తేభమ్ము
లకుఁగుండెలోనిగా • లమ్ముగాఁగ
దనతపోమహిమమ్ము • మునితల్లజులకెల్లఁ
బరగంగనోజ్జమే • ల్బంతిగాఁగ
దనకేలుగొమ్మలు • దైవతాండజములు
కూడిమాడగనిల్వ • నీడగాఁగ

ఆ॥ నమరుకేసరికిని • నంజననాఁగన్య
నిచ్చిపెండ్లిసేసె • నెలమివాని
మాతులుండువిక • మాతులుండొక్కండు
కుంజరుండనంకపి • కుంజరుండు॥ 12

క॥ ఈసరణిఁ బెండ్లియాడిన
కేసరితత్కుంజరసుత • కేళినిమిత్తం
భాసురముగఁ దానెన్నే
వాసరములుగడపెఁ గాంత • స్వాంతమువొంగన్॥ 13

ఉత్సాహము. వసుధ గాపురంపుటుత్స • వంబునకునుగారణం
బుసుతుఁ డేనటంచు నెంచి • బోటిగూడి బహువ్రతం
బుసలిపి యుఫలంబుదానఁ • బొందజాలకననునా
త్మసతిగోల్వ నాజ్ఞనిచ్చె • దైన్యము నుపుదంచఁ గాగన్॥ 14

క॥ ఈగతిఁ బనుపఁగ నాసన దాగతియసదాగతియని • తగనను భక్తిన్
శ్రీగతినినంజనాసతి యాఁగతియు కునవరకుమదిని • నలరుచుఁ గొలచెన్॥

ఉ॥ ఆదటఁద త్తపమ్మునకు • నాత్మను మెచ్చిమహేశ్వరాజ్ఞనా
స్వోదరసంస్థితంబగుసు • హేంద్రుని తేజము దెచ్చి యిచ్చినన్
మోఁదటనంజనాబ్జముఖి • మేనురగర్భమునంభరించె నా
హ్లాదముతోడ నాసరబ • లాఢ్యుని సీతని నొక్కయేడహహా॥ 16

ఉ॥ అంతట దేవదుందుభులు • నంతట మ్రోఁగఁగ వేల్పుటూంద్రమున
త్యంతము నాడవేల్పులుల • తాంతములం గురియింపరక్కసుల్
చింతల బ్రుంగ సజ్జనుల • చింతల దంగ ప్రభాతభానునిం
గాంతులమీరు సుపురుడు • గాంజరిగర్భమునుండి వెల్వడెన్॥ 17

సీ॥ మెఱుపుతీవల కాంతిఁ • మించు నెమ్మొలువాని
బొందమ్మినగుముద్దు • మోమువానిఁ
బొలుపారు మొసలివా • ప్రోగులుగలవానిఁ
గపిలవర్ణంపుమేల్ • కనులవాని
వీఁకమైవిహారాలు • దాకుచేతులవానిఁ
దెల్లనిమేలిజం • దెములవానిఁ
బెల్లులసిల్లిన • పేరుటురమువానిఁ
దొడ్డబైన చేతిక • ద్యములవాని

తే॥ మంజురుచిపుంజిగుల్కుహారా • న్మంజివానిఁ
గ్రాలుహారంబట్టుసాలుబు • జాలవానిఁ
బుడమిబుడిబుడినడకల • నడరువానిఁ
గాంచెఁగన్నారఁదల్లిదా • గన్నవాని॥ 18

హనుమంతుఁడుదయభానురాహులం బంట్లనిమ్రింగఁబోవుట.

తే॥ అప్పుడాచిన్నికుఱ్ఱనిఁ • నక్కుఁజేర్చి
సొక్కిచెక్కులుముద్దాడి • చుంచుదువ్వి
చిన్నితండ్రి! ఫలమ్ముల • నెన్నియేని
దెచ్చిపెట్టెదనిటనుండు • దేయటంచు॥ 19

మ॥ పలుమారిట్టులుబుజ్జగించిసకివ్రా • వంబాలుడాపైని ద
వ్వులఁబ్రాగ్భూమిధరమ్ముపైఁబొడము మి • న్నువ్వుజపాసూనకాం
తులఁగ్రాలందిలకించివేడ్కనొకపం • డుంగానెదందల్చి ప
క్షులరాజుందులకించువేగమునఁగోర్కుల్ మీరదూకెన్వడిన్. 20

ఉ॥ ఈపగిదిందివాకరుని • హెచ్చినయాకటిపెల్లునందగం
బాపఁడువట్టగాఁజనెడు • పట్టునఁదజ్జవమారగాంచి లో
లోపలసిద్ధసాధ్యసుర • లోకముబెగ్గిలియాడుకొండ్రు నీ
పాపఁడెవండొసూర్యుపయి • బాఱెడురెండవరాహువోయనన్ ॥ 21

క॥ వినుమానికముకడకీ యనుపునజనునపుడుపిల్లఁడాతనిదీప్తిం
మిణుకునసితరగచినుకుల వెనువెంటంజిలుకుచుండెఁనిసుదాకరిహిన్

సీ॥ పాదసంఘట్టన • బ్రహ్మాండభాండంబు
పెళపెళరవమున • బీటవార
నూరుసంఘట్టన • నూర్ధ్వలోకస్థుల
గుండెలుతటతట • కొట్టుకాడఁ
బాహువేగమ్మున • బయలఁబ్రాకెడువిమా
నమ్ములొక్కమ్మడి • వమ్ముగాఁగ
నాలవేగమునఁజే • లాలపోలికతార
కాసమూహములునొక్క • మొగిఁరాల

క్రొమ్మెఱుగునప్పు మేనిని • గ్గుదిలకించి
మొక్కు ఫ్రాగాననిమిషాఖ్య • పాక్కరమరు
లెల్లనితఁడేదియుంగాంచ • కేవుమీఱ
బాలభాస్కరువట్టినో • శైలచారి 23

వ॥ ఇట్లు బాలభానుఁబట్టునప్పుడు 24

సీ॥ వీనిపోడిమిపెక్కు • విభుదాకెననిచాయు
బెగ్గిల్లి నెటికలు • విరచిపరవ
మృత్యుంజయస్తోత్ర • మెలమిబఠింప్రుచు
వాలఖిల్యులునెక్కు • మూలకొదుగ
నాత్రిముక్తాయుధ • హస్తులై చండాంశ
పారిపార్శ్వకులొక్కు • ప్రక్కజనఁగఁ
దీన్రితాఁడెయెడజెగిన • దేయఁగిచాయ
దిట్టిస శేషమం• దేహులరుగఁ
బద్మినీకాంతు జేతుల • బట్టుమోము
పైనబెట్టును వేడిమి • బట్టజాల
కవలబెట్టును జేతుల • నడచుగిసిసి
కొట్టుమిట్టాడుతుధనునీ • కుట్టువాఁడు 25

భుజంగప్రయాతము. ప్లవంగేంద్రచంద్రుం • ప్రపంచోపకారుం
డవంచర్యముండాకు • ణాంబందునుష్ణం
బు వేజూపకుండంద • వుల్ రాహువాలో
న వేగంబబర్వంబు • నావచ్చితాకె॥ 26

క॥ ఆగ్రహముపెల్లురేగఁగ నాగ్రహవల్లభునిబట్టి • నట్టిడినా నూ
ర్యగ్రహము ప్రాలెనారా హుగ్రహమీహానుమబట్ట•నూహించుటయుః

వ॥ అంత 28

తే॥ అల్లమెఱపండుబోనా • డినల్లపం
డిదంచు రాహుద్విపేంద్రమ్ము • నెంచిపట్ట

గ్రమ్మని కేసరికిశోర • కాంతిఁగాంచి
భీతిమైసింహికేయుండు • బెల్లరచుచ ॥ 29

మ॥ త్వరతోనచ్చోటువాసివాసవునిచెం • తం జేరితద్వార్తలా
పురుహూతుండరుదందదెల్పనతఁడా • ప్తుల్ దిక్పతుల్ కూడరా
స్వరుహస్తుండయినాల్గుకొమ్ములమదే • భంబందునారోహుఁడై
సురలిర్వంకలఁగొల్వవచ్చెనటకుం • [illegible]డై॥ 30

ఉ॥ ఈగతివచ్చితమ్మిచెవి • కీవలరెండవచాయరాయఁడో
నాగమెలంగునీక్ష వగ • నాయకుఁగన్గొనికొమ్ములేనుగుం
బైఁగవియించిదిక్కటులు • బ్రద్దలుగాఁబటుసింహనాదమున్
వేగమజేయునీఘనుడు • వేగమయూతసవీడియుగ్రుఁడై ॥ 31

క॥ పండువిడబండుదొరకెడు బండువుగానాకునేడు • వహ్వాయనిపా
పండునవృటనదిదెల్లని పండువుగానెంచిగొను • పైకిందుమికెన్ ॥ 32

క॥ కేసరికొమరుఁడునిర్జర కేసరికొమ్ములమొకమ్ము • గెరలుచుఁదాకన్
వేసరిసితకరిదానిది యోసరియనిపాఱెఁబోఁడు • నింద్రుండటకున్ 33

ఉ॥ తెల్లనిగోరుపైకురుకు • ధీరవరేణ్యునివీని నేవిధిం
గల్లనిగెల్చుటప్పుతన • కైఁగలవజ్రముఁదీసి వేసినం
బిల్లని చెక్కుఁదాకుటయు • బెట్టుగనీతఁడుగుందెరెంత యోర్
ఝల్లనిమూర్ఛగొండఁబడె • సారెకుసుబ్బఁగసింహికేయుఁడున్ 34

హనుమంతుఁడింద్రవజ్రహతిమూర్ఛిల్ల వాయుదేవు
డాత్మమూర్తినుపసంహరించుట.

ఉ॥ పడ్డకుమారుఁగాంచి కడు • వందురుచంద్రునిదూరుచాతఁడే
బిడ్డకుజేసినట్టిపనిఁ • బెట్టిమనమ్మునలోకము-తటం
జడ్డనవాయురూపునుప • సంహరణంబొనరించి వెంటనే
బిడ్డనుదోడికొంచుఁజని • పెట్టెతిగోత్రగుహాంతరంబునన్ 35

వ॥ ఇట్టులేను గుమారునింగూడి గుహనుండినంత 36

సీ॥ వ్రేలిమియాజకుల్ • వ్రేల్వఁగాఁజూచిన
చేతులుజూచిన • రీతినుండె

వేల్పులు లేపదా • న్లేచుదివ్యవి
మానముల్ లేచిన • మేర్వద్రినుండె
మునికదంబము ష్నాన • మునకునీటనుముంచు
నంగముల్ ముంచిన • యట్టులుండెఁ
బశుపక్షిమృగముఖ • ప్రాణిలోకముభూమి
బెట్టఁశుంగుల్ బెట్టి • నట్టులుండెఁ
గ్రామమునకుఁబెట్టెనొకచోట • శామకొనియె
వేదపాఠముల్ జరుగక • భేదపడియెఁ
జాలఁగాలోకమెల్లగ • గ్లానిపడియె
నాదుమూర్తినుశుష వెత • బాదుకొనియె॥ 37

ఉ॥ మెండుగలోకముల్ మిశుక • మిన్నికవానినిదొట్టివేలుఘం
దండునుజోగిపిండును ప • దంబులుపాములుద్రెళ్లుకీళ్లునుం
బెంపువడంగఁదిన్నగ • మెట్టగరాకను నెట్టకేలకా
యండభవాశ్వోడదము • యాపదదెల్పఁగనేగిరెల్లరుఁ॥ 38

వ॥ ఇట్లేగి 39

తే॥ కాలుసాగక నెట్లెట్లొ • నేలకొఱగి
మ్రొక్కిచాలప్రయాసమై • మోములెత్తి
ఫాలమునగష్టసాధ్యాన • గెలదోయి
జేర్చెలుగురాక వేల్పుల • జియ్యకనిడి॥ 40

శా॥ వాణీనాథ! సృజించిలోకముజగ • త్త్రాణుఁజగత్త్రాణుగా
రాణన్నిల్పితివాతఁడేలోకా జగ • త్త్రాణమ్మునార్పంగనీ
ప్రాణిశ్రేణులకార్యనిర్వహణము • ప్పంగాకపోయెం జగ
త్త్రాణుంగ్రమ్మరనిల్పవేకరుణ నీ • బన్నంబువారింపవే॥ 41

ఉ॥ నావుడుబ్రహ్మవల్కె సుర • నాథులకోసురలార! యంజనా
దేవికిసాధ్వదరస్థశివ • తేజమువాయువొసంగబుట్టె స
ద్భావుఁడువానరుండొకఁడు • వాఁడుప్రభాతవిభాకరుఁ త్సుధఁ
వావిరిపండటంచుజని • పట్టినయంతనవచ్చెరాహువుఁ॥ 42

సీ॥ వచ్చినక్రోధుఁడై • వానిఁదాకఁగఁబోయి
వాఁడెదిరింపఁగా • వారిపోయి
శేఖరస్థుని జేరి • లెమ్మి కేమున్నది
రవిబట్టెననుదోలి • పవినిభుఁడాక
డన్నసి తేభమ్ము • నతఁడెక్కి వచ్చిశ
తారమ్ముగొనివాని • దాకనేయ
నదివానరునివాము • హనువుపదాకిన వాఁడు
మూర్ఛిల్లిపడియెదూ • ర్వ్మమలపైని
శైలమునబడ్డబిడ్డను • చంకబెట్టి
గుహానుదూరిస్వమూర్తిని • గుంచెఁబవనుఁ
డింద్రుపైఁగిన్కనద్దాన • నింతపుట్టె
"కాకిబిడ్డకాకికిముద్దు" • కాదెచెపుడ॥ 43

క॥ వాయువత్రిజగత్ప్రాణము
వాయువత్రిజగద్బలమ్ము • వాయువఖిలముఁ
వాయువధికుండుదివిజుల
వాయువచరియించునెల్ల • ప్రాణులయందున్॥ 44

ఉ॥ కావుననామహాబలుని • గ్రక్కునప్రార్థనసేయనిప్పుడే
పోవలెరండటంచురహిం • బూర్వనగమ్మునుజేరితద్గుహాం
తీవినినిల్వవచ్చితమిడె • క్కునీకుమారుతోడ నెం
తేవినయమ్మునంగొమరు • నిందగమ్రొక్కగజేసి యాపయిన్॥ 45

ఆ॥ నేన్మ్రొక్కినిల్వ • గానల్వయునునీదు
కానుపేదియితఁడ • కాదయంచు
వాణిచెక్కుపీటు • పాణిమువ్వఁగలేచెఁ
బట్టివానవాడు • పైరుపొలె॥ 46

వ॥ ఇవ్విధంబునంగొంజరీగర్భశుక్తిముక్తాఫలంబు మూర్ఛదేరియున్నంత

ఆ॥ పద్మసంభవుండుపట్టెని • దొడపైని
బెట్టిచుంచుదువ్వి • ప్రీతిముద్దు

లాకుచుండియుంత • వేకుకమూర్తి
వెలిచిప్రజకుంపుకము • గలుగ జేసి॥ 48

బ్రహ్మాదులాంజనేయునకు వరంబులొసంగుట.

మ॥ పవనున్నన్నలరించిపద్మజుఁడు దే • వశ్రేణితోనిట్లనుం
దివిజవ్రాతములార! యీకపివరుం • దీవించి శ్రేష్ఠ నీ
దువరంబుల్ కృపసేయుఁడీప్లవగచంద్రుండౌచ్చిదైత్యావళిం
దివిజశ్రేశికినంతొమేలొసగెఁడుం • దివ్యత్ర్వతాపాఢ్యుఁడై॥ 49

వ॥ అనినవేల్పు పెద్దపలుకులాలకించి యెల్లవేల్పులు వల్లెయని పల్కుటయు 50

క॥ తనవజ్రముహానువుసదా
కెనుగావునహనుమదాఖ్య • కేతగువజ్రం
బునవింక నెవ్వుడునొవ్వం
డనుచువచించె బురుహూతుఁ • డందఱుమెచ్చన్॥ 51

సీ॥ ఆత్మదండమ్మున • నాత్మాస్త్రమునవొవ్వ
బకసంభవ్యాయువు • బ్రహ్మయిచ్చె
నాత్మశూలమ్మున • నాత్మాస్త్రములనొవ్వ
బడసెప్రభావమ్ము • మృడుడొసంగె
నాత్మాపాశముమృత్యు • వాత్మదండమ్మును
వ్వంజేయవనిసను • వర్తినల్కె
నాత్మతేజమునశ • తాంసమ్మువిద్యాలి
వ్వంగలననిగ్రహ • భర్తవల్కె.
న్నాత్మపాశాంబువులనువ్వ • డనియెవరుణు
డాత్మశిఖలనశించడం • చనియెనగ్ని
యాత్మగదబడడనెశ్రీదు • డఖిలశస్త్ర
కాండములదుంగడనివిశ్వ • కర్మపలికె॥ 52

క॥ ఒక్కొక్కవేల్పునవ్వల నొక్కొక్కవరంబువేర • నొసంగగనాతో
నక్కనకగర్భుఁడిట్లనె నక్కడి జేజేలుజోగు • లందఱువినఁగన్ 53

పంచచామరము. సదాగతీ! భవత్సుతుండు • శౌర్యధైర్యధుర్యుఁ డా
పృథాసువైరివాహభక్త • బృందవంద్యమానుఁ డ
ల్లదానవేంద్రు రావణుం గ • లంచి మించు జానకీ
ముదాశ్రయుండు రామకార్య • ముద్ఘటించు ముందికన్ ॥ 54

క॥ అనిమత్కుమారు నిం బొడ గని వత్సా! నీకు ముజ్జ • గంబుల నొకఁ డుం
గ నసాధ్యము కాదిలే దనఁ గొదువేము న్నదంచు నబ్జజుఁ • డరిగెన్ ॥ 55

ఉ॥ అంతట నాత్మజాతునకు • నైదుఱ పిల్లుచు నున్న కొంజరీ
కాంతకు నప్పగించి సుతు • గ్రక్కున నేనరుగంగ నీతఁడా
చెంతలనుండు సన్మునుల • చేలములాదిగ వచ్చి వారి వా
స్వాంతములం గలంపగని • వారలు సక్రుధ శాపమిచ్చిరన్ ॥ 56

క॥ ఆపల్లనితఁడు పశ్చా త్తాపముగను నొదిదోః ప్ర • తాపంబొకరుం
డేపలుక దెలియుచుండువల నోపలబడ్డపులి భంగి • లొంగి చరించెన్ ॥ 57

హనుమంతుఁ డర్యమునొద్ద వేదశాస్త్రాలు చదువుట

ఉ॥ ఆవటనొక్కనాఁ డితఁడు • భాస్కరుఁ డిచ్చు వరంబు దల్చి స
మ్యోన్మదత విద్యలం గఱవ • బుద్ధిని నెంచి దినేశుఁ జేరి యొం
తేఁ దను వచ్చు కారణము • దెల్పి నమస్కృతి సల్ప గాన తం
డాదరణంగనుం గొనిము • దాన్వితుఁడై నటు గూర్చి యుట్లనున్ ॥ 58

ఉ॥ పావని! నాకడం జనన • వచ్చితి వ్యాసకలాగమంబులం
ద్రోవ నెటభ్యసించెదుక • చుంగొనముందర నిల్వరాదుగా
నేవశిగానలుం గగను • నీమన మొక్కటిగాగ నిల్చునే
యీవిధమెల్ల నీయెడద • నెంచి వచింపుము నీవు నావుడున్ ॥ 59

సీ॥ వికసితవదనార • విందుఁడై వడుగుపూ
ర్వాద్రి నొక్కఁడుగు న • స్తాద్రి నొక్క
పాదంబు నిడి మధ్య • భాగంబున న్దేహ
మును బెంచె త్రివిక్ర • మునకు సరిగ
నదిగాంచి లోకమ్ము • లడలెఁ దత్కర్మసా
క్షి ముదమ్ము మనమున • జెందె నంత

ఉత్సాహము. కావునంగుమారురాజు • గాగనిల్పిరాజ్యముం
బ్రోవ్రమంచుదపమొనర్ప • బోదునేనుదీనికిం
గానలసినవస్తుసమితి • గ్రచ్చరంగణించిమీ
రావలన్మహూర్తమొకట • దరయుడంచుబంచిరన్ ॥ 69

ఉత్సాహము. ఈవివాహువస్తువులఘు • టిల్లజేసిప్రాజ్ఞులెం
తేవిధించిపల్కునాడ • నేటయినదినంబటం
చావిధిసుతుఁ"డగ్రసూను"నాత్మగద్దెనిల్పెబల్
ఠీవిప్రదీపనల • లింజెలంగప్రీతిమై॥ 70

క॥ ఆవెనుకజిన్నిదొఁసు గ్రీవుని"యువరాజు"జేసి•గీశమణినిన
"పావనినెచ్చెలి"గాగను మీవనియాజ్ఞనిడివనికి•నేగదలఁచితాఁ॥

వ॥ పావనిసహితులయిన కుమారులంజేరి యందుపావనులయిన హను
మత్సుగ్రీవులు వినవగ్రనందనుండగు వాలికిట్లనియె. 72

క॥ ఒండాఙుముకలనైనను రెండాఙములుచన బట్టి•రేపనకపుడే
చెండాఙును పెద్దలగని కొండాఙుముపూజసల్పి•కూరిమిపుత్రా!॥ 73

సీ॥ కనదలంపకుపర • కాంతనునెన్నండు
కనదలంపుముపర • కాంత నెపుడు
వినదలంపకసత్య • మును జెవినెన్నండు
వినదలంపుముసత్య • మును సతంబు
జనదలంపకుదుష్ట • జనజాడనెన్నండు
జనదలంపుమునిష్ట • జనులజాడ
మనదలంపకురిక్త • జనగోష్ఠినెన్నండు
మనదలంపుముభక్త • జనులగోష్ఠి
మనుపనెంచకుదప్పున్న • ననుజునైన
మనుపనెంచుముదప్పున్న • మన్ను వేల్పు
బళిరయిటువంటిరాజుగా • నలయుజుమ్మి
కెల్లపుకటంచుప్రజలాడ • నేలుమువని॥ 74

చ॥ వదలఁగనీకునూర్పులు • వచ్చినపోయినసత్యవాక్యముఁ
మెదలఁగనీకుమిన్నొరగి • మీఁదనుబడ్డనధర్మపద్ధతిం
గదలఁగనీకుస్త్రీజన • కమ్మగుస్వాజ్ఞకపిప్రముఖ్యులం
బొదలఁగనీకుదుష్టరిపు • భూములనెల్లపుడీవుపుత్రకా!॥ 76

క॥ ఆయమునకుదగినట్టుగ • జేయుమువ్యయమెపుడు నీవుశిష్టులగన్నం
డాయుమువారికిదానము, సేయుమునీకున్నదాన • శివుఁజెందుమదిఁ

క॥ రాదుజర లేదుమృతియని, పాదుకొలిపిమదినిరెంటి• బడిబడిగొనుమీ
నాదుతలసీడ్చికొనిత్రాఁ, బోదొరఁగ నుమృత్యువంతుబుచ్చుమొకండుఁ

ఉ॥ పోడిమిగొన్నినీతులిటు • పుత్రులకుం దెలియంగ జేసితాఁ
బాడిమెలంగుమంచునల • పావనికిందగ దెల్పి,యెంతయుఁ
వాడిమినేగెధాతృజుఁడు • భర్మనగమ్మునకుందపంబుకై
కూడిమెలఁగి రైంద్రియును • గుంజరపౌత్రుఁడున్నర్కి—యాదటఁ 79

క॥ తలలో • నాలుకవలెబూ,నలలోదారంబువోలె • జక్కనువురుబె

[వాలిసుగ్రీవులు తపంబున కేఁగుట]

ద్దలలోన్నమతగపిబల,ములలోఘనతనుమెలఁగి • పొగడతగనిదా 80

శా॥ ఇంద్రార్కాత్మజులంతనొక్కదినమం • దీశానుబంచాననుఁ
సాంద్రామోదమునన్భజించితమవాం • ఛల్దీర్చికోనెంచిని
స్తంద్రప్రక్రియమంత్రిసత్తములపై • స్వారాజ్యమున్నిల్పిత
త్సాంద్రస్థైర్యులుశీతశైలమునకు • త్సాహమ్మునైనేగిరా 81

మ॥ చనితచ్ఛీతనగమ్ముపొంతనొకచో • స్నానాదికృత్యాళిఁదీ
ర్చినిరాహారులునైకుశాసనములం • జెల్వారఁగానిల్చిభ
క్తినిలింపార్చితపాదపద్మయుగళుం • దీప్తాగ్నినేత్రుందయా
బ్ధిభక్తావనదక్షుయోగిజనహృ • ద్ధ్యేయుఁ శివుంశంకరుఁ 82

(శివుఁడువాలిసుగ్రీవులకుఁ బ్రత్యక్షమై వరంబులొసంగుట)

ఉ॥ నెమ్మదినిల్పిధ్యానముసు • నిశ్చలబుద్ధినిసల్పిసత్తపం
బిమ్ములనొక్కవత్సరము • నెంతయు జేయశివుండుమెచ్చిమో

దమ్మునవచ్చెఁదత్కపిసు ♦ ధాకరులుండినచోటికిఁగతిం
బొమ్మికనేలభక్తసులం ♦ భుండనజంద్రధరుండవేల్పులన్ 83

మ॥ ఒకచాయంబ్రమథవ్రజంబనయము ♦ త్యుల్లాసతంగొల్వవే
రొకచాయన్మఘవాదిదిగ్గమణము ♦ ఖ్యుల్ భక్తి సేవింపగొం
డొకచాయన్మునిముఖ్యులెల్లనిగమా ♦ ర్థోక్తుల్ ప్రశంసింపనిం
కొకచాయంద్రిదశాబ్జపత్రనయనల్ ♦ ప్రోద్యద్గతింబాడగన్ 84

క॥ బంగారుమువ్వపల్లముఁ బొంగారుసువర్ణశృంగ ♦ ములుగై సేయన్
రంగారుగిత్తతత్తడి సింగారముగులుకనెక్కి ♦ చెలఁగెడువాఁడున్

క॥ తలజాలున్నొసలదోలు న్మలప్రోలున్నొసలవాలు ♦ మంచఁపుగోడుం
గలకేలుజందుఱాలం దలపించెడుడాలుగలిగి ♦ తనరినవాఁడున్ 86

సీ॥ ధరణీరథమువాఁడు ♦ దరబృందశరబృంద
వరకుందసదృశుం ♦ దరమువాఁడు
స్మరణీయుడగువాఁడు ♦ స్వరుధారి
శరవారిధరధారి ♦ గొలువగాదగినవాఁడు
గరినిద్రుంచినవాఁడు ♦ హరిచెల్లిసిరితల్లి
దరిబెల్లి ♦ దవుగుల్కదనరువాఁడు
ఖరునినొంచినవాఁడు ♦ గరమందుశిరమందు
హరిణేందు ♦ లధరించియలరువాఁడు

దచ్చిరూపులవాఁడు ♦ ప్రాఁతమగవాఁడు
పొడలదుప్పటివాఁడుబెం ♦ జడలవాఁడు
పేర్మిఁగలవాఁడుబుష్కల ♦ పేర్లవాఁడు
తోచెఁగపివరులకుముందుఁ ♦ బూచితేఁడు 87

వ ఇట్లు సాక్షాన్నిటలాక్షుండు తూశ్వాకోహాణుండయి సాక్షాత్కరింప ఋక్షవీరజాత్మజులారక్షోవైరివీక్షించి రక్షరక్షేతివాక్యంబులనిట్లని నుతియించిరి. 88

"వాలిసుగ్రీవకృత శివస్తవమ్,,
కందద్వయగర్భిత నిరోష్ఠ్యసర్వలఘు
సీసము.

శ్రితజనహితకర! శితిగళ!నతహిత! నగధరశర! హరి ♦ ణధర! గిరిశ!
హతగజ! శశిధర! హర! ధృతిజితధర! సిరిగలధని చెలి! క్షితిగ!సనయ!
హరితనయహరణ!హరిహయకరి,హయ;ఘనయశ!శిఖరిజ♦కలిత!సదయ
శరధిశరధి! ఘన ♦ చరిత! శిఖరిగృహ! ఖలజనహర!యహి ♦ కటక
ఆ॥ వె॥సరసహృదయ త్రిదశ♦జనహితకరహరిసనకజనకధనద♦సకలత్రిదశ
నతచరణసరసిజ! ♦ కృతిహితకర! శిఖినయన! త్రిదశశరణ!♦ సరకహిరణి
[ఈ క్రిందిపద్యములోఁ బెద్దయక్కరములు చదువఁ గ్రంథకర్తృనామ]
మేర్పడు

సీ॥ ప్రభవ!శుభాకార! ♦ యాశ్రితోద్ధార!దు
ష్టారాతిసంహార! ♦ యుగవిహార!
వరభక్తమందార! ♦ వారాశిగంభీర!
ధామనిర్జితసూర! ♦ దైత్యమార!
న్యస్తాహివరహార! ♦ నగధీర!శారదా
బ్బయసమశారీర! ♦ భయవిదూర!
రాజకళాధార! ♦ రతిరాజదార!సం
జుషువిండిఁ దెగసూడ! ♦ శుభవిచార!
హతకటుషహార!గజదైత్య ♦ హర!భాను
మండలవిహారశరధార ♦ సుహితభూత
రాజితప్రేతభూవిహా ♦ రమునినాయ
కనుతగుణవారప్రణుతప్ర ♦ కరసురగవి 90

ముక్తపదకందము

స్థేమాభిరామ! ♦ సోమా!సోమార్ధధరాభువనగ! ♦ సురరిపుభీమా!

భీమా!దుర్గాకామా! • కామారీ!కాతరోప • కారి!నమస్తే 91

గోమూత్రికా బంధము. నిరోష్ఠ్యకందము

శ్రీనగనాథా!రాధా ధీనసఖా!రాజధార!• ధీరనతాజా!
దీనజనాధారా!కంధీనసహారాధ్య!ధాత్ర్యా! • ధీననతాజ్యా 92

ఆందోళికా బంధము.

క॥ ధీరవరదాయకా!కంధరవహాయనాయకాగ్ని • నేత్రక!గంగా
ధారాధర!గోరథ!రాధారతసఖచంద్రఖండ • ధర!హర!వరధీ! 93

ఛత్రబంధము శుద్ధాంధ్రనిరోష్ఠ్యచంపకము

కడకడతేఁడ!జంకగయి• గల్గఁగ!గ్రాలొడయండ!దండనా
లడరొడయండ!యొండనక • నల్లనజేదొగినాగిత్రాగినా
తేఁడ!జడలండగంగదగఁ • దద్దనర్చుతేఁడా!తనంతనై
యడరొడయండ!యొన్నసళ • నన్ననేల్నయ!రాయ!నాయనా! 94

నాగబంధము.

చ॥ శ్రితహిత!భూతనేత!క్షితి • చింతిత!రక్షితకోణనేత!సం
తతవరదాత!భూతకర • నారదవర్ణిత!నాగహార!ప్రాం
చితగుణహార!భూతధర! • శ్రీరతిరక్షిత!భూతభావనా
సితనగజాతనేత!శివ • సేవనతత్పర!క్రూరమారకా! 95

ఖడ్గబంధము.

క॥ సారతరధీరమాకర!పారదరమణీయకాంతి • భాసురదేహా!
హారివృషరాజివాహా!దారితసుకవాహా!జన్మ• దాహా!నిరీహా 96

శైలబంధము.

క॥ శ్రీకమలాక్షీహృత్పద్మాకరరవికీర్తనీయ!•హతభయ!రతిరా
డ్భికర!సునయ!దయాకర!శ్రీకర!సకలసురముఖ్య!•కృతిముఖగేయా!

చక్రబంధము.

శా॥ రక్షోశిక్షణదక్ష!దక్షసవనా • రణోగ్రదావాగ్ని!సం
రక్షాంభోరుహసంభవాండ!సకాలామర్త్యార్చి • తాంఘ్రిద్వయా!

కుక్షిక్షిప్తమహాజగద్విసర!య • క్షుద్రోజ్జ్వలన్మానసా!
సాక్షాత్కారద!దారభగ్నకుజనా • సంస్మృత్యయోగ్యాంభసా! 98

ప్రపంచవర్గీయ కందము.

శ్రీవిశ్వేశ్వర!శైలోర్వీవాస!శివాసహాయ!• విషసంహారా!
శ్రీవృషవాహారోహా!శ్రీవరసంసేవ్య!శర్వ!• శివ!శూలి!హరా 99

అచ్చాంధ్ర నిరోష్ఠ్యకందము

కేరాటాడాల్ • రాజేజేరాటాడాలటీటిని • జెన్నారెడిరాయా
కోరానెచ్చెలి • కాడా రారాతండ్రిడిగిత్త • డాల్ రాజేజే 100

దండకము. శ్రీపార్వతీమానసాంభోజహంసా!నిశానాథ ఖండావతంసా! ప్రసేవ్యాబ్జభూ బర్హిబర్హావతంసా!లసద్భూకృతాబ్జాగ్నిహంసా! సమస్తాఘవిధ్వంస! గీర్వాణులుం బూర్వగీర్వాణులుం బాలసంద్రంబు ఘాండంబు శైలంబు కవ్వంబు నాగేంద్రు నిం ద్రాడుగా జేసిద్రచ్చంగ దొడ్డోలలోకంబు పెల్లాకులంబొంద ఘోరార్భటిం జేయుచుట్టం బినాజాదిదేవాళి వేడం గరంబందు నేరేడుబం పంబ లెంగట్టిగా బట్టి కత్కాలకూటంబు నుద్ర్మింగ వాడ్రింగి యా శేషులోకాలు లోకాలు నంచట్టితోల్యూల రాఘూల సారారగా గుత్తుక న్నిల్పవా!లోకము ంగూర్మమై దేల్పవాసర్వసర్వంస హాచక్ర మర్కేందు చక్రంబు లంబండిగా వేదముల్ గుఱ్ఱపుంబిండుగా బ్రహ్మసూతుండుగా వేలుపుల్ దండుగా గొండసింగాణిగా గుండకేంద్రుండు బెన్నారిగా నమ్మనంతుండుగాసంద్రమున్మల్ పొదింగా దగం జేసి బెస్సిన్కమైపోయి ముప్పోళ్ళు దున్మాడవా వెన్కగోపమ్ము నుస్వోడవా మున్మృకండాత్మ జుండొక్కడుం బత్తినిన్మానసంబందుధ్యానం బొగింజల్పుచుండంగ గాలుండు బెందున్నపైనెక్కి వేవచ్చి పాశంబునర్తించదగిల్చెడ్వ లింగం బునంబుట్టి డాకాల నాకాలునిండాచి భూదేవు పట్టిం బొరింగావవా దేవదేవా మహేచ్ఛంగృపందీర్చి నీదాసులన్మమ్ము రక్షింపు రక్షింపు రక్షింపు దేవా! నమస్తే నమస్తే నమస్తే నమః101

సీ॥ భువినైచరాచరం • బులభరించెనెవండు జలమైదగంబాలె • లలినెవండు
శిఖియైహుతమ్ముభు • జింపఁగలైనెవండు మరుత్తై తెలివినిడె • మహినెవండు
దివియైపథంబిడె • దివిజులకు నెవండు విధుఁడై భగణముసేల్ • వెసనెవండు
రవియైతనుచ్ఛా • లవిరియించెనెవఁడుయజ్వయై వేల్చుహ • వ్యంబెవండు
నజునియుంచునుబరమాణు వందెవండు
నుండుభేదంబు లేకని • త్యుండెవండు
నాదిమధ్యాంతరహితుండు • నగునెవండు
నాశివంకగుడవుసీవు • నౌదుమెంచు 102

మధుటాక్కర. స్మరహరణ!సజ్జనవిచార!• సంసృతిభారహర!
దరహరణ!తారధరధీర!• దారుణపాపహర!
నరశరణ!నైగమవిహార!• నాకపవైరిమార!
వరకరుణ!వైరజనదూర • వహ్నితగోకుమార! 103

తోటకము. శరణాగతవత్సల!• చంద్రధరా!
కరుణాకర!శంకర!• కామహరా!
ధరణీధ్రధనుర్ధర!• దైత్యహరా!
స్మరణీయతమోజ్జ్వల • మంత్రపరా! 104

క॥ వాలియుసుగ్రీవుండును జాలియొదవజల్పినట్టి • స్తవమునకెంతే
కాళీయుషతీశుండగు వాలియుమదిలోనమిగుల • బొక్కి యిట్టులనున్

క॥ ఓకొమారులార యీరలునాకొఱకై సలుపుతపము • నకుమెచ్చితిమీ
మీకోరిక లెఱిగింపుడు నాకొలదివరమ్ములిత్తు • ననవుడువేడ్కన్

వ॥ అంత నవ్వాలి సుగ్రీవు లిట్లనిరి 107

ఉ॥ ఓమహితప్రభావ!యొరుం • డొక్కఁడుమాపయికెత్తివచ్చినే
నామహితప్రతాపుబల • మందుసగంబాగిమమ్ముఁజెందున
ట్లీమహితావకాంఘ్రిపయి • నెప్పుడుభక్తిననుగ్రహించిదు
ర్గామహిళామనోంబుజవి • కర్తన!కావుముసాదరమ్మునన్ 108

వ॥ అనవుఁడట్లకాఁగలదనిపల్కి దివిజసేనాపరివృతుండయి మృడానీశుం
డంతహితుండగుటయు వాలిసుగ్రీవులు లబ్ధమహేశ్వర వరప్రసాదా

మోదులయి నిజపురంబునకుం జనిసుఖంబుండిరంత నొక్కనాఁడు

(రావణుఁడింద్రజుపయిఁ దండెత్తి వచ్చుట)

శా॥ పౌలస్త్యాన్వయవార్ధిచంద్రముఁడుగీ • ర్వాణాభియాత్యన్వవా
యాలంకారుఁడు రావణాహ్వయుఁడులం • కాధీశ్వరుండుగ్రప
త్కీలాలోద్భవమత్తషట్పదముల • శ్శ్రీనాథవైరుండుశౌ
ర్యాలంకారుఁడు దైత్యశిల్పితనయా • స్యాంభోజమిత్రుండొగిన్ 110

శా॥ ఆశాధీశుల నొక్కఁడే గెలిచెము • న్నంతంతనమ్మాద్రిగాఁ
గీశాధీశుని వాలిఁబోరఁగనుఁగి • ష్కింధాపురిం జేరఁ త
త్కీశాళుల్ దనుమూఁగిచూడఁగనుది • గ్వేదండముల్ గల్లనో
క్కాశంగొట్టికవాశిటంబులికిదీ • క్రౌబిట్టుగజిల్లినన్ 111

క॥ ఆరావముకీర్తిజిత తారాపరతారుఁడైన • తారుఁడువినిప
ల్కోఁ రావణవల్కుమునీ వీరానసమునఁగతము • నెఱుకపడంగన్

వ. అనిన తారునకు రావణుండిట్లనియె. 113

క॥ వాలియసమానవిక్రమ శాలియనంగ విని నేను • సమరక్రీడా
శాలినగుటవచ్చితిఁద త్కేళికినతని నెదిరింప • తెల్పవె విధముల్ 114

చ॥ అనవుఁడు రాక్షసేశ్వరున • కాతఁడు వల్కు సురద్విషేంద్రత
ద్వినుతబలాఢ్యుఁడేఁడ! భవ • దీయబలమ్మది యేఁడ! నీకు నా
యనఘునకెన్న హస్తిమశ • కాంతరమున్నది తారతమ్యమె
గనుఁగొనవాని దాకుమొన • కాఁడెంకడీవరకెందునీభువిన్ 115

ఉ॥ ఆశరనాథ! యీవరకు • నాతనిఁ దాకినవాఁడొకండు నే
నాశమునాలయమ్మునకు • నైచనవట్టిడు లేదు నీవున
ట్లాశలనన్నిటిన్విడచి • నట్టులుదో చెడుపొమ్మవాచివా
రాశికిస్నానకృత్యమొన • రంజలుపంజనెవాఁడు వెండియున్ 116

సీ॥ ప్రకటశాత్రవగర్వ • పర్వతచ్ఛటపక్ష
పుంభజగ్నోగ్రదం • భోళివాలి
వికటదానవదైత్య • వేణుశుష్కారణ్య

పాళిదాహకదావ • కీలివాలి
నికటవైరిసమూహ • నిర్భేదనైపుణ్య
చణవికసితబుద్ధి • శాలివాలి
ప్రకటరిపుచ్ఛటాఁ • భయదప్రతాపాగ్ని
కీలాద్రివిజితాంశు • మాలివాలి
యట్టిమతిశాలివరశీలి • యైనవాలి
సమరపాళికి నేనిసుం • తైనదేరి
కనఁగరాదనదేలపగాఁ • జనునె మొఱుల
దానికేమిచనుము నింద్ర • తనయుకడకు 117

క॥ బవరమునకుఁ బోరందరి సవరనిహాళం దేరినెక్కి • సాగిన జేజే
తోవకంటు లెడమ్మకన్నుం బోవలదఱుఁగాదె రావ • ణుండిది వినఁడో!

క॥ అనుచున్న తారుగర్వం బునగనిపదినోళ్ళతోన • పుచు రావణుఁడు
వ్వనిచాఁదూఁరి వేగంబున దక్షిణవార్ధిఁ జేరి • మొగిఁ దానిదరిన్ 119

సీ॥ జలములఁ గ్రుంకిని • శ్చలహృదిదర్భాస
నాసీనుఁడై నిల్చి • నట్టివాని
సలిలపూరితతామ్ర • కలశంబు డంబుమయి
నడరర్ఘ్యముడి ప్రక్క • నిడినవాని
దలిరువెన్నెలలతో • దులదూగుస్వచ్ఛంపు
మడుఁగుగప్పినగెం • పు తొడలవాని
భూతిత్రిపుండ్రముల్ • భూరిరుద్రాక్షమా
లలు దాల్చిమిన్నులఁ జె • లంగువాని
త్రిపద గాయత్రిమంత్రంబు జపముసేయు
చుఁడుగ కరగన్ను మోడ్పుతో నొప్పువాని
సూర్యభగవంతునకు భక్తిఁ జోబగిలిడి
యుదయసంధ్యను వార్చుచునుండువాని॥ 120

